గ్రామసేవా గ్రంథమాల. ౮



# కాయధాన్యములు

## కంది, పెసర, సెనగ వగైరా

కర్త

గోపేటి జోగిరాజు

Assistant Director of Agriculture [Retd.]

ప్రకాశకులు

ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు

పటమటలంక

# ప్రకాశకుల విజ్ఞప్తి

గ్రామసేవాగ్రంథమాలలో మున్ముందుగా ప్రచురించుటకు మేము సంకల్పించుకొన్న వ్యవసాయ విజ్ఞానము 20 సంపుటములలో యిప్పటికి 9 సంపుటములను వెలువరించ గలిగితిమి. ఇంకను 11 సంపుటములు అచ్చు కావలసి యున్నవి.

ఈ కార్యక్రమంలో మా కన్నివిధముల తోడ్పడు చున్నవారు గ్రంథమాలాస్థాపకులు, వ్యవసాయవిజ్ఞానము గ్రంథకర్తలు, పూజ్యులు నగు శ్రీ గోటేటి జోగిరాజుగారు, మాతోపాటు ఆంధ్రరైతాంగంయొక్క శాశ్వత కృతజ్ఞతకు పాత్రులు. చాలకాలంనుండి ఆరోగ్యం సరిగా లేకున్నను, ఎంతో ఓపికతో నూతన సంపుటముల రచన, పునర్ముద్రణ ములసవరణ, అచ్చైన సంపుటముల పరిశీలించి సవరణపట్టిక లను, విషయానుక్రమణికలను తయారుచేసియిచ్చుటద్వారా శారీరకంగా, మానసికంగా వీ రీకార్యక్రమానికి దోహదం చేస్తున్నారు. రు. 2,500 రొక్కము నిచ్చి, మే మొకపర్యా యము ప్రకటించు ప్రతిపుస్తకముయొక్క కాపీరైటుహక్కు మాకుసంక్రమించునట్లుయేర్పాటుచేసి, ఈపుస్తకాలలోచేర్చు టకుకావలసిన బ్లాకులను తామే స్వంతంగా తయారుచేయించి సరఫరాచేస్తూ ఆర్థికంగాకూడ వీరు మా కెంతో అండగా నున్నారు. తెలుగుసీమ రైతుకు వ్యవసాయవిజ్ఞానాన్ని అంద జేయవలెననేమహాసంకల్పంతో వీ రీపనులను వ్యయప్రయాస లను సరకుగొనక సాగించుచున్నారు. కనుక వీరి మేలు మాకు మరువరానిది.

వీరి ఆశయం ఫలించడానికిప్పుడు మంచి అవకాశాలున్నవి. వీరికృషి సద్వినియోగం కావడానికి అభిమానుల ఆదరం చాలాఅవసరం. వీరి పుస్తకాలన్నీ త్వరలో వెలువడియివి విరివిగా ప్రచారమైనపక్షంలో తప్పక మన వ్యవసాయ విధానంలో అభివృద్ధికరమైన మార్పులు కలుగుననుటలో యేలాటి సందేహమూ లేదు. ఆంధ్రరాష్ట్రంలోని గ్రామ పంచాయతీలు, గ్రంథాలయాలు, ఉన్నతపాఠశాలలు, సహకారసంఘాలు వీనిని తెప్పించి ఉపయోగించుకొనుటకు మన ప్రభుత్వం ఉత్తరువు లున్నవి. సంపన్నులగు భూస్వాములు మాగ్రంథమాలకు మహారాజపోషకులుగ, రాజపోషకులుగ, పోషకులుగ విరాళాలిచ్చి ఆదరించుటకే కార్యము చాల యోగ్యమైనది. ఇప్పటికే ఈవిధంగా చేరినవారుకూడ కొందరున్నారు. కాని తమపేరట ఒక్కొక్క పుస్తకాన్ని అచ్చువేయుటకగు ఖర్చులిచ్చి పుణ్యంకట్టుకొనడానికికూడా దాతలకవకాశ మున్నది. ఈనడుమనే తెనాలి తాలూకా కోపల్లె వాస్తవ్యులు శ్రీమతి నల్లూరు వనజాక్షమ్మగారు 'తృణధాన్యములు - మొదటి భాగము' అచ్చునిమిత్తం రు. 1500 లు విరాళ మిచ్చుటకు మున్ముందుగా అంగీకరించి యీవిషయంలో యితరులకు మార్గదర్శకులైనారు. వీరి వితరణ శ్లాఘనీయము. మేము వీరి కత్యంతము కృతజ్ఞులము.

శ్రీ సర్వోత్తమ భవనము
పటమట లంక
1-7-1954

ఇట్లు విన్నవించు
కొమ్మూరి సీతారామయ్య
ఆం. గ్రం. ట్రస్టు పాలక ధర్మకర్త

# కృతజ్ఞత



శ్రీమతి నల్లూరు వనజాక్షమ్మగారు

చూపిన మార్గముననుసరించి, మావిజ్ఞప్తిని పురస్కరించుకొని

తెనాలి తాలూకా దుగ్గిరాల వాస్తవ్యులు

గ్రామ పంచాయతీ అధ్యక్షులు నగు

శ్రీయుత పరుచూరి లలిత ప్రసాదరావుగారు

ఈ గ్రంథ ముద్రణము నిమిత్తము

**రు. 600-0-0** ఆరు వందల రూపాయలను

మా గ్రామ సేవా గ్రంథమాలకు విరాళముగ నొసంగిరని తెలుపుటకు సంతసించుచున్నాము. ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు పక్షమున వీరికి మా హృదయపూర్వక కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

— ప్రకాశకులు

# వి ష య సూ చి క

# పటముల పట్టిక



# సవరణల పట్టిక *

| పుట | పంక్తి | తప్పు లేక తీసివేయవలసినది | ఒప్పు లేక చేర్చవలసినది |
|---|---|---|---|
| 2 | 3 | సాగు చేయబడు | సాగు చేయబడిన |
| 7 | 1 | వ్రేళ్లు | వేళ్లు |
| 9 | 13–14 | ద్వివిదారుణ ఫలము. | ద్వివిదారణ ఫలము |
| 17 | 9 | పరగణాల | ప్రదేశ్ |
| 22 | 7 | నడపులనియు | నడుపులనియు |
| 32 | 4 | ముద్దహః | ముద్గః |
| 42 | 22 | 38 వ పుటలో | 39 వ పుటలో |
| 50 | 9 | వ్రూసికోను | మూసికోను |
| 58 | 15 | 1951-52 | 1950-51 |
| 61 | 24 | తెలుపు, యెరుపుతో గూడిన | |
| 62 | హెడ్డింగు | మినుము | సెనగ |
| 63 | 9 | గురియు | ముగియు |
| 65 | 15 | బోవుటచే | బోయవలసియుండుటచే |
| 66 | హెడ్డింగు | మినుము | సెనగ |
| 68 | ,, | ,, | ,, |
| 69 | 7 | యమ్మటయు | యమ్ముటయు |
| 70 | ,, | ,, | ,, |
| 71 | 6 | పెసర వలెనే | పెసరకువలెనే |

* చదువరు లీ గ్రంథమును జదువనారంభింపక ముందే ఈ పట్టికయందు సూచింపబడిన సవరణలను ఆయా పుటలందు చేసికొన దగును.

| పుట | పంక్తి | తప్పు లేక తీసివేయవలసినది | ఒప్పు లేక చేర్చవలసినది |
|---|---|---|---|
| 71 | 10,11 | నిదర్శనముగ యనుముల | అనుముల |
| ,, | 20 | పరగణాల | ప్రదేశ్ |
| 90 | 11 | రు 1కి 25 పౌ. చొ॥ | రు 1కి $6\frac{1}{4}$ పౌ. చొ॥ |
| 91 | 22 | కూడకాయ | కూడ నిథరకాయ |
| 102 | 11 | రు 1కి 36 పౌ. చొ॥ | రు 1కి 9 పౌ. చొ॥ |
| ,, | 12 | రు 1కి 250 పౌ. చొ॥ | |
| ,, | 20 | రు 1కి 86 పౌ. చొ॥ | |
| ,, | 21 | రు 1కి 250 పౌ. చొ॥ | |
| 108 | 14 | 6.02 | 60.2 |
| 109 | 4 | చల్లిననేల | చల్లిననెల |
| 113 | 9 | రు 1కి 40 పౌ. చొ॥ | రు 1కి 10 పౌ. చొ॥ |
| 116 | 14 | బిళ్లలుగ | చిళ్లలుగ |
| ,, | 15 | ,, | ,, |
| ,, | 16 | ,, | ,, |
| 118 | 26 | నిండులకు పచ్చియొరువునకును | నిండులకును పచ్చియొరువునకును |
| 121 | 1 | పెసర నల్లపెసరవలె | పెసరను నల్లపెసరవలె |
| ,, | 5 | ఇదిచాల | ఇది చాలవరకు |
| ,, | 10 | గ్రీకు | గ్రీసు |
| 122 | 22 | పరిమాణము | పరిమాణమున |
| 125 | 8 | నందు ఉపదళములు | నందు 2 ఉపదళములు |
| 181 | 11 | Pengype | Pe Ngype |

# EDUCATION DEPARTMENT

G. O. Ms. No. 1922 Education,

dated 11th August, 1953

ORDER–

The Andhra Granthalaya Trust, Patamatalanka, Vijayawada, has published certain books in Telugu on "Agriculture". These books are standard works produced by an authority on the subject and they constitute a full library on agricultural subjects in Telugu. A list of these books together with particulars of cost is annexed to these proceedings. The Panchayats in the Telugu Districts are permitted to purchase, without the sanction of any outside authority, a copy of these books, if they desire to do so.

2. The Inspector of Municipal Councils and Local Boards is requested to communicate the orders in para 1 above to all the Panchayats in the Telugu Districts in the State.

3. The Director of Public Libraries is requested to issue a circular recommending the use of the books in all public libraries including Local Board Libraries and High School Libraries in the Telugu Districts in the State.

(By order of the Governor)

K. M. UNNITHAN,

Secretary to the Government.

## ANNEXURE

| | | | |
|---|---|---|---|
| Vyavasaya Sastramu | Volume | 1 | 4-8. |
| do | ,, | 2 | 5-8. |
| Cerials | Part | I | 4-8. |
| do | ,, | II | 3-8. |
| Pulses | | | 2-0. |
| Oil seeds and other oil stuffs | | | 3-8- |
| Sugar cane and other sugar and starch crops | | | 4-0- |
| Fruits | Part 1. | | 3-0- |
| do | ,, 2. | | 4-0- |
| do | ,, 3. | | 3-0- |
| do | ,, 4. | | 5-0- |
| do | ,, 5. | | 4-0- |
| Gardening | | | 3-0- |
| Condiments and other drugs | | | 5-0- |
| Industrial crops | | | 3-8- |
| Vegetables | | | 5-0- |
| Fodder crops, green manure crops and other miscellaneous crops | | | 3-8- |
| First lessons in agriculture | | | 3-0- |
| Agri-pictures of Rural Education and notes separately. | | | 6-0- |

: ప్రతులకు :

మేనేజరు, గ్రంథాలయ పుస్తకశాల

పటమట పోస్టు, కృష్ణాజిల్లా.

లేక

మేనేజరు, గ్రామసేవా ప్రచురణములు, కొండెవరం

పిఠాపురం తాలూకా, తూర్పుగోదావరి జిల్లా.

# గ్రామ సేవా గ్రంథమాల

పటమట పోస్టు : : కృష్ణా జిల్లా

: స్థాపకులు & మహారాజపోషకులు :

## శ్రీ గోటేటి జోగిరాజుగారు

Asst. Director of Agriculture (Retd.)

స్వయంపోషక కృష్యాశ్రమము, కొండెవరం

: మహారాజపోషకులు :

## శ్రీ నల్లూరు వనజాక్షమ్మగారు

(కీ. శే. నల్లూరు సాంబయ్యగారిధర్మపత్ని)

కోపల్లె, తెనాలి తాలూకా

: రాజపోషకులు :

## శ్రీ తుమ్మల రామకోటయ్యగారు

శ్రీ సత్యనారాయణ మోటారు ట్రాన్స్‌పోర్టు, నరసరావుపేట

: పోషకులు :

## శ్రీ సామినేని వెంకయ్యగారు

రేమిడిచర్ల, మధిర తాలూకా

## శ్రీ వల్లూరు కేశవరావుగారు

అం. దే. గ్రం. సంఘ కోశాధిపతి, పటమటలంక

## శ్రీ నల్లూరురాజయ్య చౌదరిగారు

కూచిపూడి, తెనాలి తాలూకా

## శ్రీ తల్లాప్రగడ నరసింహాశర్మగారు

ఉంగుటూరు, తాడేపల్లిగూడెం తాలూకా

★ శ్రీ యల్. ముత్తయ్యకిసాన్‌గారు, ఎమ్. ఎల్. ఏ.
పెదపల్లి, కరీంనగర్ జిల్లా

★ శ్రీ గుదిబండి గోపిరెడ్డిగారు
( కీ. శే. అవుతు రామిరెడ్డి గారి అల్లుడు )
కొల్లిపర, తెనాలి తాలూకా

★ శ్రీ పులిజాల వెంకట రంగారావుగారు
వకీలు, నల్లగొండ

★ శ్రీ వడ్లమూడి సీతారామస్వామిగారు
గొల్లపూడి, విజయవాడ తాలూకా

★ శ్రీ అంగజాల వెంకటేశముగారు
జయపురం, కోరాపుట్టి జిల్లా

★ ఈ గుర్తు గలవారు పోషకులుగా చేరుటకు వాగ్దానం చేసిన వారు.

: ఉద్ధారకులు :

శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య నాయుడుగారు
ప్రొప్రయిటరు, కృష్ణా మైనింగ్ కంపెనీ, మోహన్‌ప్యాలెస్, కైట్ ఫీల్డు
బెంగుళూరు జిల్లా

# కాయధాన్యములు

## అవతారిక

కాయధాన్యము లనగా కంది, పెసర, సెనగ మొదలగు పప్పు దినుసులు. మానవశరీరమునకు గావలసిన కర్బనోద జనితములును, మాంసకృత్తులును యుక్త ప్రమాణమున లభింపపలెనన్న ముఖ్యాహార ద్రవ్యములగు తృణధాన్యములతో అందుకంటె మాంసకృత్తులు హెచ్చుగనుండు పప్పుదినుసులను గూడ గొంతవరకు జేర్చి తినుట యవసరము. వీని మూలమున తృణధాన్యము లందు తక్కువగ నుండు ఖనిజద్రవ్యముల యొక్కయు విటమినుల యొక్కయు లోటు కూడ గొంతవరకు దీరును.

తృణధాన్యముల వలెనే కాయధాన్యములును ప్రపంచమం దంతటను సాగు చేయబడుచున్నవి. కాని ఆయా దేశము లందలి వివిధ కాయధాన్యపు పైరుల విస్తీర్ణము తెలుపు అంకెలు లభ్యము కాలేదు. ఇండియాలోనైనను ఒక సెనగ విషయమున దప్ప తక్కిన కాయధాన్యముల విస్తీర్ణము ప్రత్యేకముగ దెలుపు లెక్కలు గానరావు. వీని విస్తీర్ణ మితర యాహార సస్యముల విస్తీర్ణముతో గలిపి లెక్క వేయబడుచున్నది. ఐనను నిటీవల వేయబడిన నొక యంచనా ప్రకారము ఇండియాలో మొత్తము మీద 1949–50 సంవత్సరమునందు 4.62 కోట్ల యెకరములపై కాయధాన్య జాతులు సాగు చేయబడెనని యంచనా వేయబడెను. (*Pulses in the National Economy, Rural India 1952*). ఇందు తృణధాన్యములు

వగైరా ఇతర సస్యములతో కలిపి సాగు చేయబడుచున్న విస్తీర్ణము గూడ చేరియున్నది. దినుసువారీ వివరములు ఈ క్రింద తెలుపబడెను.

| దినుసు | 1949-50 లో సాగుచేయబడు విస్తీర్ణము ( ఎకరములు ) | 1949-50 లో ఉత్పత్తి ( టన్నులలో ) |
|---|---|---|
| సెనగ | 2,01,87,000 | 36,51,000 |
| కంది | 49,94,000 | 10,46,000 |
| అనుము | 34,32,000 | 2,89,000 |
| మినుము | 36,73,000 | 4,12,000 |
| గడ్డిసెనగ లేక బోడిసెనగ | 29,09,000 | 5,80,000 |
| బటానీ | 27,24,000 | 5,85,000 |
| పెసర | 27,46,000 | 2,81,000 |
| మసూరీ లేక చిరుసెనగ | 19,84,000 | 4,07,000 |
| ఇతర కాయధాన్యములు | 35,20,000 | 4,08,000 |
| మొత్తం | 4,61,69,000 | 76,59,000 |

ఇండియా మొత్తపు సాగు విస్తీర్ణమున నీ కాయధాన్యముల సాగు విస్తీర్ణము సుమారు నాల్గవ వంతుండును. ఇండియాలో నిపుడు ఉత్పత్తి యగుచున్న కాయధాన్యములు సుమారు 78 లక్షల టన్నులలో 70 లక్షల టన్నులు ప్రజల యాహారమునకు వినియోగింపబడు చున్నవి. అనగా సగటున మనిషి 1కి 2 ఔన్సుల చొ॥న ఉపయోగపడుచున్నవి. కాని సంపూర్ణాహారము లభింపలెనన్న మనిషి 1కి $3\frac{1}{3}$ ఔన్సుల చొ॥న లభింప జేయ వలసియుండును. ఇట్లు లభింపజేయుటకు ఇప్పుడు ఆహారమునకు లభించుచున్న 70 లక్షల టన్నులు కాక మరి 52 లక్షల టన్ను లుత్పత్తి కావలసియుండును. మరియు యేటేట పెరుగుచున్న జనాభా కంతటికి సరిపోవుటకు ప్రతి పదేండ్లకును మనిషి 1కి దినమునకు 2 ఔన్సుల చొ॥న చూచినను మరి 27లక్షలటన్నులు అదనముగ ఉత్పత్తి చేయవలసియుండును

కావున నీహెచ్చు ఉత్పత్తికి తగిన ఉపాయములను గనిపెట్టి దేశమున నములు చేయవలసియుండును. ఈ విషయమై ముందు విపులముగ చర్చించ బడును. చెన్నపురిరాజధానిలో నేటేట కాయధాన్యములు సాగు చేయబడు విస్తీర్ణము సుమారు 30 లక్షల యెకరము లుండునని తేలెను. తెలుగు జిల్లాలలోని విస్తీర్ణము ప్రత్యేకముగ నీ క్రింద చూపబడినట్లు 18 లక్షల యెకరములకు మించి యుండును 1.

| జిల్లా | 1950-51 సం॥లో సాగు చేయబడిన విస్తీర్ణము ( ఎకరములు ) |
|---|---|
| శ్రీకాకుళము | 1,35,392 |
| అనంతపురం | 3,50,304 |
| విశాఖపట్నం | 1,35,883 |
| తూర్పుగోదావరి | 1,39,350 |
| బళ్ళారి | 1,99,063 |
| నెల్లూరు | 1,16,104 |
| కర్నూలు | 1,88,340 |
| గుంటూరు | 1,71,372 |
| కృష్ణా | 1,98,316 |
| పడమటి గోదావరి | 71,139 |
| చిత్తూరు | 39,830 |
| కడప | 66,731 |
| మొత్తము | 18,11,824 |
| చెన్నరాష్ట్రపు మొత్తపు సాగు | 29,72,538 |

1. పంక్తులలో గొంచె మెగువగ ముద్రింపబడిన యిట్టి యంకెలు, ఈ గ్రంథ రచనకు దోడ్పడిన రెండవ యనుబంధము నందలి గ్రంథపు లేక వ్యాసపు సంఖ్యను సూచించును.

చెన్నరాష్ట్రపు మొత్తపు కాయధాన్యముల యుత్పత్తి 2,91,960 టన్ను లుండునని లెక్క వేయబడెను. దీనిని రాష్ట్రమునందలి సుమారు $5\frac{1}{2}$ కోట్ల జనముపైన లెక్కకట్టిన యెడల మనిషి 1కి దినమునకు .5 ఔన్సు ($1\frac{1}{4}$ తులము) చొ॥న వచ్చును. ఇపుడు సుమారు మరి 3 లక్షల టన్నుల కాయధాన్యములు దిగుమతియై యుపయోగింపబడుటచే మొత్తముమీద మనిషి 1కి దినమునకు సుమారు 1 ఔన్సు చొ॥న లభ్యమగు చున్నవి. జనుల యారోగ్యమునకు దినమున కర్ధమను 3 ఔన్సులచొ॥న కావలసియుండును. ఇట్లు లెక్కచూచిన యెడల ఈ రాజధాని యందలి కాయధాన్యపుపంట 6 రెట్లు పెంచవలసియుండును. కావున ప్రభుత్వము, కర్షకులు గూడ యీ విషయములో తగిన శ్రద్ధ వహింపవలసి యుండును.

చెన్నపురిరాజధానిలో సాగు విస్తీర్ణమున ఉలవ యగ్రస్థానము నాక్రమించు చున్నది. పెసర, కంది, మినుము, సెనగ ఇవి విస్తీర్ణమున నొకదాని తరువాత మరియొకటి తక్కువ. ఇవిగాక అనుము, బొబ్బర కూడ నీ రాజధానియందు గొంతవరకు సాగు చేయబడుచున్నవి. పిల్లి పెసర, మిటిక, బోడిసెనగ ఇవి స్థానికముగ సాగు చేయబడు మరికొన్ని పప్పు దినుసులు. ఇండియాలోని యితర రాష్ట్రము లందు బటానీ, ముసిరి, గోరుచిక్కుడు మొదలగు కొన్ని యితర జాతులు గూడ సాగు చేయబడుచున్నవి. చీనా మొదలగు కొన్ని యితర దేశములలో 'సోయ' అనుము అను నొక కాయధాన్యజాతి గూడ విరివిగ సాగు చేయబడు చున్నది. ఇది యిటీవల నీ దేశమున గూడ ప్రవేశపెట్టబడెను. ఆ యా దేశములందు కొద్దిగొప్ప సాగు చేయబడుచున్న కాయధాన్యజాతులింకను ననేకములు గలవు. సామాన్యముగ కూరకుపయోగించు కొన్ని చిక్కుడు జాతుల గింజలను గూడ యెండబెట్టి కాయధాన్యముల వలె నుపయోగించుట గలదు.

ఆంధ్రరాష్ట్రమున విస్తారముగ సాగు చేయబడుచున్న ఆ యా కాయధాన్యముల విస్తీర్ణము ఈ క్రింద పట్టికయందు జూపబడెను.

| | 1950-51 సంవత్సరములో సాగు విస్తీర్ణము (ఎకరములు) | 1950-51 సంవత్సరములో ఉత్పత్తి (టన్నులు) |
|---|---|---|
| ఉలవ ... | 8,98,495 | 64,970 |
| పెసర ... | 3,78,219 | 65,290 |
| కంది ... | 2,09,073 | 20,990 |
| మినుము ... | 1,51,688 | 17,020 |
| సెనగ ... | 1,15,307 | 21,060 |
| ఇతరములు ... | 52,859 | ...... |
| మొత్తం | 18,05,641 | 1,89,330 |

ఆంధ్రరాష్ట్రమున ఉత్పత్తియగు కాయధాన్యములలో సామాన్యముగ మానవాహారముగ యుపయోగింప బడు కంది, మినుము, పెసర, సెనగ ఈ నాల్గింటి మొత్తపు పంటను జనాభా 2కోట్ల మీదను లెక్కగట్టిన యెడల దినమునకు .6 ఔన్సుల చొ॥న వచ్చును. ఆంధ్రరాష్ట్ర ప్రజల కందరకును సగటున దినమునకు 3 ఔన్సుల చొ॥న లభింపజేయవలెనన్న ఇప్పటి పంటకు 5 రెట్లు కాయధాన్యములు పండింపబడవలసి యుండును.

కాయధాన్యజాతు లన్నియు చిక్కుడు కుటుంబములో జేరిన యేక వార్షికములు. కంది చిన్నగుల్మముగా పెరుగును. సెనగ చిన్న మొక్కగ పెరుగును. పెసర, మినుము, సోయ, అనుము గూడ నిట్లే చిన్న మొక్కలుగ పెరుగును. కాని వీనిలో కొన్ని పరిస్థితులందు కొమ్మల కొనలు యించుక తీగగ సాగు స్వభావము గలదు. అనుమునకును, ఉలవకును నీ స్వభావము మరికొంత హెచ్చుగ గలదు. బొబ్బర తీగగనే ప్రాకును.

ఇతర ద్విదళబీజకము లందు వలెనే కాయధాన్యముల మొక్కలం దొక తల్లివేరును దానికి కొన్ని శాఖలును, ఉపశాఖలును ఉండును

1 వ పటము



ఒక కాయధాన్యజాతి
(కంది) వేరు
($\frac{1}{10}$ ఆకృతి)

ఈ తరగతి మొక్కల వేళ్ల యందు కొన్ని సూక్ష్మజీవులు చెమటకాయల వంటి మొటిమలను బుట్టించి యందు నివసించుచు వాయువునుండి కొంత నత్రజనిని సేకరించి మొక్కల వ్రేళ్ల కొసగును. కావున నీ తరగతి సస్య

ములు పెరుగునపుడు నేలయందలి నత్రజని వ్యయము కాకపోవుటయేగాక కొంతవరకు వృద్ధి యగును. నేలలలో నత్రజని తక్కువగ నున్నను ఇట్టి

2 వ పటము



కాయధాన్యపు వేళ్లయందు
గానగు మొటిమలు
(సహజాకృతి)

సూక్ష్మజీవు లుండుచో నా లోటు గాన్పింపదు. ఈ జీవు లీ ప్రాంతము లందలి మంచి నేల లన్నిటియందును గలవు. కావున నీ తరగతి సస్యములకు నత్రజని యెరువు వేయనవసరము లేదు. కొన్ని దేశములలో అవి లేనిచోట్ల ఆ యా జాతులకు దగిన జీవులను కొన్ని ద్రవ్యములపై ప్రత్యేకముగ బెంచి విత్తులతో గలిపి చల్లుట గలదు.

చాల జాతుల కాయధాన్యముల యాకులు మూడు ఉపదళములు గలిగి యుండు మిశ్రమ పత్రము. సెనగ, జటాని మొదలగు కొన్నిటిలో నీ యుపదళముల సంఖ్య వేప ఆకులో వలె హెచ్చుగ నుండును.

3 వ పటము



మూడు ఉపదళములు గల యొక కాయ ధాన్యజాతి (పెసర)యాకు(త్రిఆకృతి)

4 వ పటము



పెక్కు ఉపదళ ములు గల యొక జాతి (సెనగ) యాకు (పూర్ణాకృతి)

కాయధాన్య జాతుల పూవులన్నియు నొకే విధమగు నిర్మాణము గలవి. విడచినపుడు అవి యొక విధమగు శీతాకోక చిలుకను బోలి యుండును. రక్షకపత్రము లయిదును కొంతవరకయిన కలసియుండును

## 5 వ పటము

A



ఒక కాయధాన్యజాతి
(పెసర) మొగ్గ
(రెట్టింపు ఆకృతి)
**1.** తొడిమ; **2.** పుష్పకోశము;
**3.** దళవలయము (యింకను విడువ లేదు).

B




ఒక కాయధాన్యజాతి
(పెసర) పూవు
(రెట్టింపు ఆకృతి)
**1.** తొడిమ; **2.** పుష్పకోశము;
**3.** పతాకదళము; **4** తక్కిన దళములు (యింకను విడువలేదు).

రక్షక పత్రము లైదును విడివిడిగ నుండును. పైది పెద్దది. పూవు చినపుడది పైకెత్తిపెట్టుకొని పడగవలె నుండుటచే దీనికి పతాకము (Standard) అని పేరు. లోపల నుండు రెండును అంతకంటె చిన్నవి. తక్కిన రెండును మరింత చిన్నవి. కింజల్కములు పది. అందు తొమ్మిది యొక కట్టగను ఒకటి విడిగను నుండును. అండాశయము ఒకటే యుండును.

కాయ యంచు లతికింపబడిన రెండు డిప్పలు గలిగియుండు ద్విపుటఫలము. అనగా ముదిరిన పిమ్మట క్రమముగ ఎండి తనయంతట నది రెండు యంచులను పగులును. కాయ పొడవు ఆయా జాతులలో ½ అంగుళము (ఉ. సెనగ) మొదలు 6 అంగుళములకు పైగను (ఉ. బొబ్బర) నుండును. వెడల్పు సుమారు $\frac{1}{10}$ అంగుళము (ఉ. పిల్లిపెసర) మొదలు ½ అంగుళము (ఉ. అనుము) వరకుండును. గింజల సంఖ్య కొన్నిటి

6 వ పటము



ఒక కాయధాన్యజాతి
(కంది)కాయ – పగిలినది
(½ ఆకృతి)

(ఉ. సెనగ)లో నొకటి రెండు మొదలు మరికొన్నిటి (ఉ. పెసర) లో 8–12 వరకుండును.

గింజ కందిలోవలె కొంచెమించుమించు గుండ్రముగగాని, పెసర, మినుములోవలె యించుమించుక కోలగగాని, ఉలవ, అనుములో వలె కొంత బల్ల పరుపుగగాని యుండును. ఇట్లే పరిమాణ భేదములునుగలవు. పిల్లి పెసరగింజ అన్నిటిలో మిగులచిన్నది. అనుపగింజ అన్నిటిలో పెద్దది. గింజయందు మధ్య యంకురము గలిగిన రెండు పప్పు బద్దలును, వాని నావరించి రెండు పలు చని పొరలు గల బీజకవచమును నుండును.

## 7 వ పటము

A



ఒక కాయధాన్యజాతి (అనుము)గింజ. (రెట్టింపు ఆకృతి)

B




ఒక కాయధాన్యజాతిగింజ(అనుము)పప్పు బద్దలు విడదీసినయాకృతి-(రెట్టింపు) 1. బీజకవచము; 2. బీజదళము; 3. బీజాంకురము.

సామాన్యోపయోగమున నున్న కాయధాన్య జాతుల గింజలలో సగటున తృణధాన్యజాతులలో కంటె మాంసకృత్తులు రెట్టింపునకు పైగా నుండును. కర్బనోదజనితములు వానిలోకంటె తగ్గియుండును. 9 జాతుల కాయధాన్యపు గింజలలో తేమను మినహాయించి లెక్కగట్టినచో సగటున

సుమారు నూటికి **24.24** వంతులు మాంసకృత్తులును, **63.32** కర్బనోదజనితములును ఉండ, **13** జాతుల తృణధాన్యములలో సగటున సుమారు నూటికి **10.71** వంతులు మాంసకృత్తులును, **75.63** వంతులు కర్బనోదజనితములు ఉండెను3. మొత్తపు పోషకశక్తి(*Calorific value*)లో రెండు తరగతుల ధాన్యములును కొంచె మించు మించు సమానములే. తేమను మినహాయించకుండ లెక్క గట్టినచో సగటున ఔన్సుకు సుమారు **96** కాలరీలు ఉండును. కాయధాన్య జాతులలో ఖనిజద్రవ్యములు సగటున దంపుడు బియ్యములోకంటె సుమారు ఐదు రెట్లును, జొన్నలో కంటె సుమారు రెట్టింపును ఉండును. కాయధాన్య జాతులలో సామాన్యముగ తృణధాన్యము లందుకంటె విటమిన్ $A$, $B_1$ లు కొంచెము హెచ్చుగ నుండును. తృణధాన్యములందు లేని విటమిను $B_2$ ఇందు మెండుగ గలదు. మొలకకట్టిన కాయధాన్యములలో విటమిను $C$ కూడ కొంత యుండును.

కాయధాన్య జాతుల గింజలను నీటిలో నానవేసిన యెడల నవి **12-24** గంటలలో నుబ్బి యటుపిమ్మట మొలకెత్తును. కాని కొన్ని గింజలట్లు నానక గట్టిగనే యుండును. బీజకవచము సులభముగ నీరింకని స్వభావము గలదగుటయే యిందుకు గారణము4. ఇట్టి గింజల సృష్టి ప్రతికూల పరిస్థితు లందు జాతి యంతరించి పోకుండ కాపాడుటకై ప్రకృతి గావించిన యేర్పాటుగ గనబడును. ఎట్లన, వెనుకటి సంవత్సరమున మొక్క మొక్క జీవితాంతమున రాలిన గింజలు మరుసటి సంవత్సరము వర్షించి యనుకూల పరిస్థితు లేర్పడగనే మొలచి యెదుగ నారంభించిన పిమ్మట వరపు వలనగాని, యితర కారణముల వలనగాని యవి యన్నియు నశించుట తటస్థించుచో నీ గట్టిగింజలు మరల మంచి పరిస్థితు లేర్పడు వరకు అనగా మరి యొకటి రెండు సంవత్సరముల వరకు చైతన్యమును గోల్పోక నిలచియుండి యపుడు మొలచి జాతిని నిలబెట్టును.

చాల జాతుల కాయధాన్యపు గింజల మొలక పంటకు వచ్చిన వెంటనే తక్కువగ నుండి క్రమముగ బెరుగును. కొన్ని జాతుల గింజలు 9 నెలలకు గాని దాదాపు పూర్తిగ మొలవక పోవచ్చును5.

బాగుగ నెండించి సీసాలలో గాలి తగులకుండ మూసియుంచిన యెడల కాయధాన్య జాతుల విత్తులు తృణధాన్య జాతుల గింజలకంటె హెచ్చుకాలము చైతన్యముతో నుండును. ఒకానొక తణిఖీలో 5 సంవత్సరములకు పిమ్మట గూడ ఆయా జాతుల గింజలు సుమారు నూటికి 87 మొదలు 98 వరకు మొలకెత్తెను. పైని చెప్పినట్లు తేమ యింకని బీజకవచములు గల గట్టిగింజలు కొన్ని యింకను చాలకాలము (15 యేండ్లకు పైబడి) చైతన్యయుతముగ నుండును4.

ఇండియాలో ఉత్పత్తియగు కాయధాన్యములు చాలవరకందు స్థానికముగనే యుపయోగింపబడు మన్నవి. ఎగుమతి దిగుమతులు స్వల్పము.

ఇండియాలో - ముఖ్యముగ దక్షిణ యిండియాలో కాయధాన్యముల ఉత్పత్తి ప్రజల ఆరోగ్యమునకు ఉపయోగింపవలసిన పరిమితికంటె మిగుల తక్కువయని ఇదివరలో వ్రాయబడెను. కావున నీ పంటను అభివృద్ధి చేయుటకు మార్గములను అన్వేషింపవలసి యున్నది. ఈ మార్గములు రెండు విధములు. కాయధాన్యములను సాగు చేయు విస్తీర్ణమును హెచ్చుచేయుట యొకటి. రెండవది హెచ్చు పంటనిచ్చు వంగడముల నెంచుట.

కాయధాన్యములు సామాన్యముగ నితర సస్యములతో మిశ్రమముగ సాగు చేయబడుచున్నవి. మాగాణి భూములందును, కొన్ని మెట్ట నేలలందును వీనిని ప్రత్యేకముగ సాగుజేయుటయు గలదు. మిశ్రణముగ గాని ప్రత్యేకముగ గాని కాయధాన్యములను సాగు చేయుట వలన భూమికి యిదివరలో తెలుపబడినట్లు కొంత నత్రజనియు సేంద్రియ పదార్థములును చేరును. కావున వీనిని నేలయందలి నత్రజనిని తీసికొని పెరుగు తృణధాన్యములు, చమురుగింజలు, ప్రత్తి వగైరాలతో కలిపి మిశ్రణముగ గాని అట్టి రెండేసిపంటలకు మధ్యకాలమున ప్రత్యేకముగ గాని యిప్పటికంటె సాధ్యమైనంత హెచ్చు తరుచుగ సాగు చేయుచుండదగును. ఇతర సస్యములను మాని వానికి బదులు కాయధాన్యములను సాగు చేయుటకు వానివలె నివి యేటేట తగినంతగా ఫలించునను నమ్మకము లేక పోవుటచే కర్షకులు వెనుదీయుచుందురు. తక్కిన సస్యములకంటె కాయ

ధాన్యపు పంటలు అననుకూల వాతావరణ పరిస్థితులలో తరుచు చెడు చుండును. వీనికి కీటక బాధయు హెచ్చు. ఎకరము 1కి ఇవి యిచ్చు ఫలసాయము మిగుల తక్కువగుటచే వ్యయముతో కూడిన నివారణోపాయముల నవలంబింప సాధ్యపడదు.

కావున ప్రతికూల వాతావరణ పరిస్థితులను గాని చీడలను గాని అంతగా లెక్కచెయ్యనట్టియు సహజముగ హెచ్చు పంట నిచ్చునట్టియు క్రొత్త వంగడములను సృష్టించుటయే కాయధాన్యపు పంటను హెచ్చు చేయుటకు ముఖ్యోపాయముగ నగపడుచున్నది.

ఇటీవల చెన్నరాష్ట్రపు వ్యవసాయశాఖవారిచే నీ విషయమున కృషి కొంత జరుపబడెను. మొదట ప్రత్తి పరిశోధకుని వలనను, చిరుధాన్యముల పరిశోధకుని వలనను కొన్ని వంగడము లెంచి వృద్ధి చేయబడెను. 1943 వ సంవత్సరమునుండి ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ ఎగ్రికల్చరల్ రీసెర్చి (న్యూఢిల్లీ) వారు కొంత ధన సహాయము చేయుచుండుట వలన నీ పరిశోధనకు కొంత ప్రత్యేక సిబ్బంది యేర్పాటు చేయబడెను. వీరు కోయంబత్తూరు, సేలం, విజయనగరం ఈ మూడు ప్రదేశములందును ఆయా కాయధాన్యజాతులందలి పెక్కు రకములను సమకూర్చుకొని వాని నుండి కొన్ని శ్రేష్ఠమైన వంగడముల నెంచి తీయగలిగిరి. విజయనగరము నందు నెలకొల్పిన తాత్కాలిక కాయధాన్య పరిశోధనా స్థానమున కంది, మినుము, పెసర, ఉలవ ఈ నాల్గింటిని గురించిన కృషియు హెచ్చుగ జరిగెను. వీనినుండి యింతవరకు యెంచి తీయబడిన వంగడములు ఆయా జాతులను గురించిన భాగములందు పేర్కొనబడును.

కాయధాన్యముల సాగు వలన పైన తెలుపబడినట్లు కర్షకులకు తగినంత హెచ్చు ఫలసాయము లభింపకున్నను, వాని సాగువలన భూమి యందలి సారము హెచ్చి అందువలన ఈ కాయధాన్యములతో మిశ్రణముగ గాని వానితో పరివర్తనముగ గాని సాగు చేయబడు సస్యముల పంట హెచ్చును. కావున వీనికి కర్షకులు తమ కమతములపైన నవలంబించు సస్యపరివర్తనమునందు నెక్కువ ప్రాముఖ్యత నొసగవలెను.

పూసా క్షేత్రమున జరిగిన ఒక తణిఖీలో వరుసగ తృణధాన్యము లనే సాగు చేయుచు వచ్చినపుడును, రెండు తృణధాన్యపు పంటలకు మధ్య నొక కాయధాన్యపు పంటను సాగుచేసినపుడును 22 సం॥లపై సగటున తేలిన పంట పరిమితులు క్రింది పట్టికలో తెలుపబడెను.

| తణిఖీ | తృణధాన్యములు మాత్రమే సాగు చేసినపుడు సగటు పంట ఎ. 1కి పౌనులు | | | రెండు తృణధాన్యపు పంటలు ఒక కాయధాన్యపుపంట-సాగు చేసినపుడు సగటున ఎ1కిపౌ॥లు | | |
|---|---|---|---|---|---|---|
| | మొ॥జొన్న | యవ | ఓట్సు | మొ॥జొన్న | కంది | ఓట్సు |
| A | 464.3 | 317.1 | 413.4 | 579.0 | 758.4 | 473.9 |
| B | 481.6 | 354.9 | 444.3 | 508.3 | 685.2 | 439.2 |
| సగటు | 473.0 | 336.0 | 428.9 | 542.7 | 721.8 | 456.6 |
| | 512.6 | | | 573.7 | | |

మొత్తపు:పంట పెంపు 61.1 లేక 12%.

పై యంకెలను బట్టి నూటికి ఎ 1కి కాయధాన్య పరివర్తనమునందు మూడు పంటలను కలిపి నూటికి 12 వంతులు చొప్పున హెచ్చు దిగుబడి యయ్యెననియు, మొక్కజొన్న ఓట్సుపంటలు మాత్రమే లెక్క చూచిన యెడల ఎ 1కి నూటికి 10 వంతులు చొప్పున హెచ్చు దిగుబడి యయ్యెననియు తెలియుచున్నది.

ఇటీవల జరిగిన మరికొన్ని మూడేండ్ల తణిఖీలలో మార్పు లేక తృణ ధాన్యములనే సాగు చేయుచు వచ్చినప్పటి మళ్లలో కంటె తృణధాన్యము లతో కాయధాన్యములను మార్చి పెట్టుటవలన మొక్కజొన్న పంట నూటికి 4.5% ను, గోధుమపంట 22.1% న్ను హెచ్చెను.

కాయధాన్యజాతులను తృణధాన్య జాతులతో మార్చి పెట్టుటయే కాక యీ రెండు తరగతుల జాతులను మిశ్రణముగ సాగు చేయుటకూడ చాల యనుకూలము. తొలకరిని విత్తదగు తృణధాన్య జాతులతో కలిపి

పెట్టబడు ముఖ్య కాయధాన్యజాతి కంది. సామాన్యముగ గోదావరి జిల్లాలోను మరికొన్ని యితర జిల్లాలలోను మెట్టవరితో కంది కలిపి విత్త బడుచుండును. ఈ రెంటిలోను ప్రత్తిగూడ కలుపబడుచుండుట గలదు. గోదావరి డెల్టాలోని మెరక వండలి భూములందు ఇట్టి మిశ్రణము వలన వరియు కందియు వేర్వేరుగ సాగు చేసిన యెంత పంట పండునో నీ మిశ్రణమునందును వాని పంట యంతకు తీసిపోదు. అనగా సగము భూమిలోనే అంతపంటయు పండును. పూసాలో జరిగిన కొన్ని భూములలో గంటెను కందిని కలిపి రొటేట సాగు చేయుట వలన ఈ రెంటికిని మరికొన్ని సస్యములను వేర్వేరుగ పరివర్తనము గావించుట వలన కంటె హెచ్చు పంట లభ్యమయ్యెను.

# కంది

## *Red gram - Cajanus Indicus*

అరవము-తువరై; మళయాళము-తువర; కన్నడము-తొగరి;

హిందీ-తుర్, అర్హార్; సంస్కృతము-ఆఢకి

## 1. చరిత్ర, వ్యాపకము

కంది యుష్ణమండల వాసి. ఆఫ్రికా ఖండమందలి నిరక్షర రేఖా సమీప భాగము దీని జన్మస్థానమై యుండవచ్చునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము[6]*. ఆ ప్రాంతముల నుండి యిండియాకు వ్యాపించియుండునని యూహింపబడుచున్నది. ఈ దేశమునందిది వన్యస్థితి యందు గానరాదు[7].

యజుర్వేదమున (5-2-5) పేర్కొనబడిన సప్తగ్రామ్యములందు గాని, సప్తారణ్యకములందు గాని యీ సస్యము చేరలేదు. చరకుని యందు పదుమూడు ధాన్య జాతులలో కూడ నిది గానరాదు. బృహదారణ్యకోపనిషత్తునందలి దశధాన్యములందు కొన్ని యితర గ్రామ్య ధాన్యములు పేర్కొన్నను అందు కంది కానరాదు. కావున నిండియాలోనికిది బౌద్ధయుగమునకు వెనుకగనే వచ్చియుండునని యూహింపదగియున్నది. పాణిని యష్టాధ్యాయి (2-4-31) యందు దీని ప్రశంస యుండుట గానవగును. సూత్రకాలము నుండియు నుపనయనవివాహాదులందు జేయబడు అంకుర

---

* ఆఫ్రికాలో నైలునది కెగువ భాగమున నిది వన్యస్థితిలో గానగునట[6]. ఈ గింజలు ఈజిప్టు దేశపు 12 వ తరపు రాజుల గోరీల గానబడుట యా దేశమున కంది చాల ప్రాచీన కాలముననే సాగున దుండెననుటకు నిదర్శనము.

శోషణ కుపయోగింపబడు నవధాన్యములలో నిది యొకటిగ నున్నది. కావున కంది యిండియాకు మాత్రకాలమున వచ్చి యుండవలెను. ఆటు పిమ్మట వాఙ్మయమున దీని ప్రశంస యచ్చటచ్చట గలదు.

కంది యిపుడు ఆఫ్రికాఖండమందును, ఆసియా ఖండపు టుష్ణ ప్రదేశములందును విరివిగ సాగు చేయబడు చున్నది. అమెరికా సమీపమున నున్న పడమటి యిండియా ద్వీపములలో గూడ నిది విస్తారముగ సాగు నందున్నది.

ఇండియాలో నీ సస్యము బొంబాయి, చెన్నపురి రాజధానులందు విస్తారముగ సాగు చేయబడుచున్నది. కొంత వరకు మధ్య పరగణాల యందును, ఇతర రాష్ట్రములందును కూడ సాగు చేయబడుచున్నది. కాని ఆయా రాష్ట్రములందీ సస్యము సాగు చేయబడుచున్న విస్తీర్ణమును తెలుపు అంకెలు లభించలేదు.

చెన్నరాజధానిలో నీ సస్యము పైరు చేయబడు సగటు విస్తీర్ణము 341162 యెకరములని యంచనా వేయబడెను. ఇందు 209073 యెకరములు ఆంధ్రదేశమునకు జెందియున్నవి. జిల్లావారీ వివరములు క్రింది పట్టికలో గాననగును[1].

| జిల్లా | 1950-51 వ సం॥లో సాగు విస్తీర్ణము (ఎకరములు) | 1950-51 వ సం॥లో ఉత్పత్తి (టన్నులు) |
|---|---|---|
| శ్రీకాకుళము | 6335 | 820 |
| అనంతపురం | 58610 | 4580 |
| బళ్ళారి | 35710 | 2870 |
| కర్నూలు | 39218 | 3870 |
| గుంటూరు | 26340 | 3460 |
| విశాఖపట్నం | 9033 | 1090 |
| మొత్తం | 175246 | 16690 |

(3)

| | 1950-51 వ సం॥లో సాగు విస్తీర్ణము ( ఎకరములు ) | 1950-51 వ సం॥లో ఉత్పత్తి ( టన్నులు ) |
|---|---|---|
| వెనుకటి ప్రుటుసుండి | 175246 | 16690 |
| తూర్పుగోదావరి | 8171 | 1090 |
| పశ్చిమగోదావరి | 4102 | 700 |
| కృష్ణా | 6047 | 920 |
| చిత్తూరు | 4789 | 700 |
| కడప | 6284 | 610 |
| నెల్లూరు | 4484 | 280 |
| మొత్తము | 209078 | 20990 |

## 2. మొక్కయొక్క స్వభావము, ఇతర విషయములు

కంది మొక్క సుమారు 3-6 అడుగుల యెత్తుగు పెరుగు నందమగు గుల్మము. సామాన్యముగ నేక వార్షికముగ సాగు చేయబడు చున్నను అనుకూల పరిస్థితులందు 2-3 సంవత్సరముల వరకు జీవించి 15 అడుగుల యెత్తు వరకు పెరిగి చిన్న చెట్టగుట గలదు. బర్బడోసు దీవులలో నిది 7 సంవత్సరముల వరకు పెరిగినట్లు నిదర్శనములు గలవు.

కంది మొక్కల వేళ్ళు (1వ పటము చూడుడు) తక్కిన కాయధాన్య జాతుల వేళ్లకంటె లోతుగ బోయి తేమను ఆహారమును తీసికొన గలవు. కావుననీ సస్యము వరపున కాగును. వేళ్ళు గట్టి నేలలోనికి గూడ చొరుచుకొని పోగలుగుటచే నవి చీకిన వెనుక నా రంధ్రముల గుండ నీటి పడుపు సులభమగును.

## 9 వ పటము



కంది యాకు ($\frac{1}{2}$ ఆకృతి).

కంది యాకు నిడివిగ నుండు 3 ఉపదళములు గలిగి యుండును. ఉపదళములు సుమారు 2–3 అంగుళముల పొడవును, $\frac{1}{2}$–1 అంగుళము వెడల్పును ఉండును. కొనదళము తక్కినవానికంటె కొంచెము పెద్దదిగ నుండును.

కంది పూవులు కొమ్మల చివర గుత్తులు గుత్తులుగ బయలుదేరును. కొన్ని రకములలో క్రింది కణుపులందు గూడ నీ గుత్తు లుండుటగలదు. పూవు చిన్నది. పూర్తిగ నెదిగిన మొగ్గ సుమారు $\frac{1}{3}$ అంగుళము పొడవును $\frac{1}{4}$ అంగుళము వెడల్పును మాత్రమే యుండును. సామాన్యపు రకములలో ఆకర్షక పత్రములందు లోని నాలుగును (పక్షదళములును, ద్రోణిదళములును) పసిమిగ నుండును. పైది (పతాకదళము) యెరుపుగ గాని, యెరుపు చారలు మచ్చలు గలిగి గాని యుండును. కొన్ని రకములలో నిది కూడ పూర్తిగ పసిమి వర్ణము గలిగి యుండుటయు గలదు.

కంది పూవులు సాధారణముగ ఆత్మసంపర్కము వలన గర్భవతులయినను కొంత వరకు (సుమారు నూటికి 7 వరకు) పరసంపర్కమునకు గూడ లోనగుచుండునని కనిపెట్టబడెను. తుమ్మెదలు మొదలగు కీటకములు పుప్పొడి నొక పూవునుండి మరియొక పూవునకు గొనిపోవుటకు సహకారులుగ నుండును.

కందికాయ సుమారు 1½ అంగుళము మొదలు 3 అంగుళముల వరకు పొడవుండును. రకమునుబట్టి ¼-½ అంగుళము వెడల్పుండును. దళమంత కంటె కొంచెము తగ్గియుండును. పచ్చి కాయలు పైని ఆకుపచ్చగ గాని, ఆకుపచ్చని రంగుపై ఊదా లేక కొంచెమించుమించు నలుపు చారలు మచ్చలు గలిగి గాని యుండును.

10 వ పటము



కందికాయ (½ ఆకృతి)

11 వ పటము



కందిగింజ (2 రెట్లు)

కంది గింజలు కొంచెమించుమించు గుండ్రముగ నుండును. పరిమాణము రకమును బట్టి యుండును. ఔన్సుకు సుమారు 150-400 వరకు తూగు రకములు గలవు. రంగు భేదములలో తెలుపు, యెరుపు, నలుపు రంగులు ప్రధానములు. వీని సంయోగములు కూడ గానవగును.

11 వ పుటలో సూచింపబడినట్లు నీటిలో వేసిన త్వరలో నానియుబ్బని గట్టిగింజలు కంది గింజలలో స్వల్పముగ నుండును.

కంది రకములను గురించి పూసా వ్యవసాయ పరిశోధనా స్థానమందు చాల పరిశోధన జరిగెను. ఇవి ప్రధానముగ గింజల రంగునుబట్టి గుర్తింపబడు చుండును. దీనినిబట్టి కంది రకములను యెరుపు, తెలుపు అని రెండు ముఖ్య తరగతులుగ విభజింపవచ్చును. యెరుపు రకములలో లేత ముదురు భేదములును, యెరుపుతో గోధుమ, బూడిద వర్ణముల మిశ్ర

ణములును గల రకములు గలవు. ఊదాతో గూడిన నలుపు రకములు గూడ నరుదుగ గలవు. పై మూడు రకములకును సంకరము వలన బుట్టు మొక్కలందలి గింజలపై నీ రంగులు గల మచ్చలును, చుక్కలును గాన నగును. కావున పెక్కు రకములు సాగు చేయబడు ప్రదేశములం దే రకపు గింజలు గాని సామాన్యముగ స్వచ్ఛముగ నుండవు.

గింజల పరిమాణమును బట్టి కంది రకములను పెద్ద కంది యనియు, చిరుకంది యనియు, నడపు లనియు మూడు ముఖ్యతరగతులుగ విభజింప వచ్చును. కంది రకము లన్నిటిలో ఏజన్సీ ప్రాంతములందు సాగు చేయబడు కొండకంది గింజ మిగుల పెద్దది. ఈ గింజలు చాలావరకు తెలుపుగ నుండును. వీనితో మిశ్రణముగ యెరుపు, ఊదారంగు, నలుపు రంగు గల చుక్కలు మచ్చలు గల గింజలు కూడ నుండును. గింజలు మధ్యమ పరిమాణము గలిగియుండు రకములు నడుపు లనిపించుకొనును. ఇవి చాలవరకు గోధుమ మిశ్రితమయిన వివిధ వన్నెలు గలిగి యుండు యెరుపు రకములు. ఈ తరగతి కందులలో గోదావరి జిల్లాలోని మెరక ప్రదేశములందు - ముఖ్యముగా పెద్దాపురం తాలూకాలో - గానవగు రకము ప్రశస్తముగ నెంచబడు చున్నది. చిరుకంది రకముల గింజలు కూడ సామాన్యముగ నడుపుల వలెనే గోధుమ వర్ణముతో గూడిన యెరుపు రంగు గలిగి యుండును. గుణుపురపు కందియు, గుంటూరు కందియు నిందు కుదాహరణములు. ఈ తరగతిలోని రకము లాంధ్ర దేశమం దంతటను విరివిగ సాగు చేయబడు చున్నవి.

ఫలించుటకు పట్టు కాలమునుబట్టి కందులలో పునాస, పెద్ద భేదములు గలవు. సామాన్యముగ నీరాజధానిలో పైరు చేయబడు కంది రకములు జూన్‌లో చల్లు నెడల డిసెంబరు_జనవరి నెలలలో నరకుటకు సిద్ధమగును. వీనిని పెద్ద కంది రకములనవచ్చును. ఇంతకు ముందుగ అనగా అక్టోబరు_నవంబరు నెలలలోనే ఫలించు పునాస రకములు కొన్ని ఉత్తర, మధ్య హిందూస్థానములందు గలవు. పై ముఖ్య భేదములు గాక పూవుల

రంగు నందును, కాయల రంగు, ఆకార పరిమాణాదు లందును, గెలల తీరునందును, మొక్కలయెత్తు, కొమ్మల వైఖరి మొదలగువాని యందును గూడ నాయా రకములలో భేదములు గలవు[10].

పూవులు తరుచు పర సంపర్కమునకు లోనగుటచే వరి మొదలగు వానిలో వలె ప్రశస్తమగు మొక్కల నెంచి వాని విత్తులను ప్రత్యేకముగ జల్లి వృద్ధిచేసి మంచి వంగడముల నుత్పత్తి చేయుట సులభమగు పనిగాదు. కాని యెంపుడు మొక్కలనుండి దీసిన విత్తులను సమీపమున నితర రకములు లేనిచోట్ల విత్తి సాగు చేసి యట్టి చేనిలో మధ్య భాగము నందలి యెంపుడు మొక్కలనుండి మరల విత్తులను దీసి చల్లుచు నేటేట నిట్లు చేయుచు వచ్చిన యెడల కొంత వరకు స్వచ్ఛముగ నుండు మంచి రకము లేర్పడును. గోదావరి డెల్టాలోని మెట్ట భూములందు 'గెలకంది' యను రకము ఇట్లచటి రైతులలో నొకరెంచి వృద్ధి చేసినదే. ఇది పెద్ద గెలలు వేసి హెచ్చుగ కాయు నందురు.

ఇటీవల కోయంబత్తూరు వ్యవసాయ పరిశోధనా స్థానమునందును, విజయనగరం తాత్కాలిక కాయధాన్య పరిశోధనా క్షేత్రమునను జరిగిన కృషివలన సాగున కనుకూలించు ప్రశస్తమయిన వంగడము లెవ్వియు నింకను లభ్యము కాలేదు. విజయనగర క్షేత్రమున నెంచి తీయబడిన *R. G. 72, R. G. 97* అను రెండు వంగడములు అనుకూలముగ నుండవచ్చునని యెంచబడుచున్నవి.

## 3. సాగునకు దగిన పరిస్థితులు

కందిమొక్క యుష్ణమండలపు జాతులలోని దగుటచే నీ పైరు నిరక్షరరేఖ కిరుప్రక్కల నుండు దేశములందు విస్తారముగ సాగు చేయబడు చున్నది. మిక్కిలి తక్కువ తేమతోనే పైరగుట చేతను ఇవక కాగక పోవుటచేతను వర్షము తక్కువగ గురియు ప్రదేశములే దీని సాగున కనుకూలములు. చలి హెచ్చుగా నుండు ప్రదేశములు గాని, వర్షములు మెండుగ

గురియు చోట్లు గాని దీనిని సాగు చేయుటకు వీలుపడదు. కాని యంతి యనుకూలము గాకపోయినను నీ విషయము లందు మధ్యమములుగ నుండు ప్రదేశములం దీ సస్యము కొంతవరకు సాగు చేయబడుచున్నది.

వర్ష కాల ప్రారంభమే అనగా సామాన్యముగ జూన్-జూలై నెలలు కంది చల్లుటకు ముఖ్యకాలము. అప్పటికి ఉష్ణత తగ్గకుండ నేలయందు కావలసినంత తేమ గలుగును. వర్షములు వెనుకగ కురియు కొన్నిచోట్ల ఆగష్టు నెలలో జల్లుటయు వేసవిలో వర్షములు గురియు కొన్నిచోట్ల మే నెలలోనే జల్లుటయు గూడ గలదు. పూతకాలము వర్షకాలము నతిక్ర మించునట్లు చల్లికకాలమును నిర్ణయించవలెను. ఇందుకుగాను తూర్పు వర్షములు దీర్ఘముగ గురియుచోట్ల కొంత యాలస్యముగను, నవి త్వరలో ముగియుచోట్ల ముందుగను జల్లుట యుక్తము. విత్తుకాలమును బట్టియు, రకమునుబట్టియు కందిచేను ఫలించుటకు 4 మొదలు 10 నెలలవరకు బట్టును.

కంది అన్ని విధముల నేలలందును పైరు చేయబడు చున్నది. ఇవుకి లేకపోవుట కందికి దగిన నేలల ముఖ్యలక్షణము. కావున మెరకగనుండు ఎఱ్ఱనేలలం దిది విస్తారముగ పైరు చేయబడుచున్నది. గరుప నేల లందును, అంతగా జిగురుగ లేని వండలి నేల లందును ఇది ప్రశస్తముగ నెదిగి హెచ్చుపంట నిచ్చును.

## 4. సేద్య విధానము

కందిని ప్రత్యేకముగ సాగుచేయు టరుదు. సామాన్యముగా దీనిని తొలకరిలో జల్లు మెట్టవరి మొదలగు తృణధాన్యములతో గాని, నూవ్వు మొదలగు చమురు దినుసులతో గాని కలిపి చల్లుదురు. గోదావరి జిల్లా లోని వండలి నేలలో నవలంబింపబడుచున్న బుడమవరి+కంది+ప్రత్తి మిశ్రణము మిక్కిలి యనుకూల మయినవి. బీద నేలలలో కంది సామాన్య ముగ ఆరికతో కలిపి సాగు చేయబడు చుండును. కంది నిట్లు కలిపి చల్లు టచే నట్లు కలిపి చల్లిన సస్యపు పంట తగ్గకుండగనే కందులు నూడ

లభించును. అరుదుగ కందిని ప్రత్యేకముగ జల్లుట కూడ గలదు. అపుడు దీనిని గంటె, అరిక మొదలగు తృణధాన్యములతోను, నూవు, వేరుసెనగ మొదలగు చమురు దినుసులతోను మార్చి పైరు చేయుచుందురు. కంది సాగు చేసిన నేలపై తరువాత పైరు చేయబడు సస్యము కూడ బాగుగ ఫలించును. నేల కిది నత్రజనిని జేర్చుటయే గాక, వేరు లోతుగ పోవుటచే లోతునుండి సారమును దీసికొనివచ్చి మెండుగ రాలు ఆకుల రూపమున పై నేలకు జేర్చును.

మెట్టవరితో గాని, నూవుతో గాని, యితర తృణధాన్యములతో గాని కలిపి సాగు చేయునపుడు కందివిత్తుల నావిత్తులతోనే కలిపి వెదజల్లవచ్చును. లేక తృణధాన్యములను వెదజల్లి కందులను 3-6 అడుగుల దూరమున నుండు వరుసలలో 1½-2 అడుగుల దూరమున నాగటిచాలున వేయవచ్చును. లేక కర్రతో పొడిచి వేయవచ్చును. తృణధాన్యములను గొర్రుతో చల్లి కందిని 'అక్కడి' గొట్టముతో 6 చాళ్ల కొక వరుస చొప్పున వేయవచ్చును. మొక్కజొన్నను నాగటిచాలులో వేయుచోట్ల కందులను ముందు వెదజల్లి పిమ్మట మొక్కజొన్నలను విత్తుదురు. కంది గింజలను వరిచేల గట్లపై కన్నములు పొడిచి యందు వేయుట చాలచోట్ల గలదు. మిశ్రణముగ నెకరమునకు సుమారు 1 సేరు (2¼పౌ.) కందులు చాలును. ప్రత్యేకముగ జల్లునెడల 3-4 సేర్ల వరకు జల్లుట గలదు. నేల నిస్సారముగ నుండుటచే గాని, వర్షములు మెండగుటచే గాని మొక్కలంతగా నెదుగని చోట్ల మిశ్రణముగను ప్రత్యేకముగను గూడ పై పరిస్థితులకంటె హెచ్చు విత్తులను జల్లవలసి యుండును. కాని యనవసరముగ నొత్తుగ జల్లిన కందిచేలు బాగుగ గాయవు.

మిశ్రణముగ జల్లిన సస్యమునకు ప్రధాన సస్యముతో పాటే దీనికిని గొప్పు త్రవ్వుట లేక పాపటము తోలుట కలుపుతీత మొదలగు పనులు జరుగును. ప్రత్యేకముగ జల్లుచో దీని కాంతరకృషి చేయుటరుదు. కందిమొక్క మిక్కిలి తక్కువ తేమతోనే పెరుగ గలుగుటచే నాంతరకృషి చేయకపోయినను నంతగ నెబ్బరలేదు. వర్షములు మెండుగగురియు

ప్రదేశములలో సాంతరకృషి చేసినచో నేల హెచ్చు తేమను పట్టి యుంచుటచే మొక్కలు చెడవచ్చును.

కంది కెప్పుడును నీరు పెట్టుట పనికిరాదు. నేల యే కారణముననైనను తడిసిన యెడల కొన్ని మొక్కలు చచ్చుటయు తక్కినవి హెచ్చుగ రొట్టపోసి కాయక పోవుటయు తటస్థించును.

కంది హెచ్చు తేమ నోర్వజాలక పోవుటచే అధికమగు వర్షము ముఖ్యారిష్టము. చేను పెరిగియున్నపుడు మెండుగ గురియుచో మొక్కలు వంగి పడిపోవును. నీరు నిలచిన వేళ్లు జబ్బుపడి మొక్కలు చచ్చుట గూడ తటస్థించును. కావున నీరు నిలువకుండ చూడవలెను. పూత కాలమునను పిందె కేర్పడుచున్న కాలమునను మబ్బువేసిగాని, వర్షించిగాని వాయువు నందార్ద్రత హెచ్చునెడల పూవులు గర్భవతులుగాక యవియు పిందెలును రాలిపోవును. మొగ్గలకును, కాయలకును ఒక విధమగు పచ్చ పురుగు ( *Gram caterpillar-Heliothis obsoleta* ) పట్టి వానిని పాడు చేయును. ఒక్కొకప్పుడు మొక్కల లేతభాగముల కొక విధమగు పిండి పురుగు ( *Lablab bug-Coptosoma cribraria* ) పట్టి యందలి సారమును పీల్చుకొనుట గలదు[11]. కాని కేట్టుబాటుగ నుండు ప్రతీకారము గానరాదు. నిల్వజేసిన కందులకు సామాన్యముగ కాయధాన్యముల కన్నిటికిని బట్టు నొక విధమగు పెంకిపురుగు ( *Bruchus chinensis* ) పట్టి వానిని దొలిచివేయును. పురుగు పట్టకుండ నిల్వజేయు విధానము ముందు వ్రాయబడును. బొంబాయి రాజధానిలోను, మధ్య రాష్ట్రము లందును, బీహారు నందును ఒక విధమగు శిలీంధ్రము పట్టుట వలన మొక్కలు అతి శరము వలెనవలె వడలి చచ్చిపోవుట గలదు. ఈ తెగులునకు చావు తెగులు ( *Wilt disease* ) అని పేరు[12]. ఇట్టి తెగులు పట్టని వంగడములను ఎంచి తీయుటకు పూసాలో ప్రయత్నములు జరుగుచున్నవి. ఈ తెగు లాంధ్రదేశమున గూడ కొన్ని చోట్ల (తుని ప్రాంతములందు) కనిపెట్టబడెను. కాని పై రాష్ట్రములందు కలిగించునంత హాని కలిగించుటలేదు.

# 5. కోత, కైలు వగైరా

కాయలన్నియు ముదిరి చాలవరకెండినపుడు మొక్కలను మొదటికి నరకి మోపులుగ కట్టి గూళ్లుగా నిలువబెట్టవలెను. కొన్నిచోట్ల ముదిరిన కొలదిని కాయలను గోయు నలవాటు గలదు. కాని యిది ప్రయాసకరము. గూళ్ళుగ కొన్ని దినములు మొక్క లెండిన యెడల నదివరకు కట్టి పడని గింజలుగూడ కట్టిపడును. మోపులను విడదీసి యెండలో నారబెట్టి బాగుగ నెండిన వెనుక పిమ్మట నొక్కొక మొక్కను ప్రత్యేకముగ దీసి బల్లపై కొట్టిన యెడల కాయలు పగిలి గింజలు రాలిపోవును. కొన్ని కాయలు గూడ పగులకుండగనే రాలును. వీనిని సాధ్యమైనంత వరకు చేతులతో వొల్లి అవసరమగుచో మరల నెండబెట్టి బడితెలతో నలుగగొట్టవలెను. పిమ్మట గాలి కెగురబోసి ఆకులు, డిప్పలు మొదలగువానినుండి గింజలను విడదీయవలెను.

ఇట్లు తయారు చేసిన కందులను బాగుగ నెండబెట్టవలెను. విత్తులకును మరుసటి సంవత్సరము వరకు తిండికిని సరిపడు గింజల నుంచుకొని తక్కినవానిని సాధ్యమయినంత త్వరలో నమ్మివేయవలెను. ఉంచుకొను గింజలను కుండలలో గాని, డబ్బాలలో గాని పోయుట మంచిది. మూడి కట్టలను గూడ కట్టవచ్చును. ఎందులో పోసినను ప్రక్కలనుండి పురుగు దూరకుండ జూచి పైనుండి పురుగు దిగకుండ సుమారు 2-3 అంగుళముల దళముగ నిసుక గాని, బూడిద గాని పోయుట మంచిది. నెలకొక సారి మరల యెండబోయుచుండుట మరింత యనుకూలము. బాగుగ నెండించిన కంది గింజలను సీసాలలో తేమ తగులకుండ మూసియుంచి పరీక్షింపగా 5 యేండ్లకు వెనుకగూడ సుమారు నూటికి 87 వంతులకు పైగా మొలకెత్తెను.

ఇతర సస్యములతో గలిపి సాగు చేయబడు పంటనుండి సగటున నెకరమునకు సుమారు 240-360 పౌనులు (27-40 కుంచములు) కందులు కావచ్చును. ప్రత్యేకముగా చల్లుచో 360-540 పౌనుల (40-60 కుంచములు) కందులు కావచ్చును. మిశ్రణముగ 1500 పౌనుల వరకును ప్రత్యేక

ముగ 1800 పౌనుల వరకును అయిన నేలలు గలవు. బొత్తు సామాన్యముగ గింజలకు రెట్టింపును కంప నాలుగంతలును నగును.

మెట్టవరి, మొక్కజొన్న మొదలగు వానితో కందిని మిశ్రణముగ సాగు చేయు నపుడు క్రింది పట్టికలో వివరింపబడినట్లు ఎ. 1కి సుమారు 11 రూపాయల యదనపు వ్యయముతో దీనివలన 60 రూపాయల అదనపు ఆదాయము రావచ్చును*.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు | | | వ్యయము |
|---|---|---|---|---|---|
| | | ప.జ. | మ. | ఆ.‡ | రు.అ.పై |
| జూన్-జూలై | విత్తులు-1సేరు (2¼ పౌనులు) | | | | 0- 9-0 |
| డిసెంబరు | నరకుట, మోపులు కట్టుట | | 2 | 4 | 3- 0-0 |
| జనవరి | కొట్టుట, నూర్పిడి, యెగుర బోత వగైరాలు | | 6 | ½ | 6- 4-0 |
| | గింజలు,బొత్తు,కంప యింటికి తోలుట | ¼ | ½ | | 1- 4-0 |
| | మొత్తము | ¼ | 8½ | 4½ | 11- 1-0 |

| రాబడి | | రు.అ.పై |
|---|---|---|
| కందులు 300 పౌ. (సుమారు 33 కుం) | | 40- 0-0 |
| బొత్తు 600 పౌనులు (½ బండి) | | 12- 0-0 |
| కంప 1200 పౌనులు (1 బండి) | | 8- 0-0 |
| | మొత్తము | 60- 0-0 |
| నికరలాభము ... | ... | 46-15-0 |

* మెట్టవరి సాగునకును, మొక్కజొన్న సాగునకును అగు వ్యయమును వానివలన రాదగు ఆదాయమును తృణధాన్యములు-మొదటిభాగమునందు తెలుపబడెను.

‡ ప.జ.=పశువుల జతలు; మ.=మగవాండ్రు; ఆ.=ఆడువాండ్రు.

ప్రత్యేకముగ సాగుచేయుచో ఎ. 1కి వ్యయమును, ఆదాయమును ఈ క్రింది యంచనా ప్రకారముండవచ్చును.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు | | | వ్యయము |
|---|---|---|---|---|---|
| | | ప.జ. | మ. | ఆ. | రు.అ.పై |
| మే-జూన్ | దుక్కి-2 సార్లు | 3 | 3 | | 12-0-0 |
| | గుంటక తోలుట-1 సారి | ½ | ½ | | 2-0-0 |
| జూన్- | విత్తులు-4 సేర్లు (9 పౌనులు) | | | | 2-4-0 |
| జూలై | వెదజల్లుట, కలియ దున్నుట | 3 | 3 | | 12-0-0 |
| | గొప్పు త్రవ్వుట కలుపుతీత-1సారి | | 1 | 12 | 7-0-0 |
| | నరకుట, మోపులుకట్టుట, గూళ్లు పెట్టుట | | 1 | 6 | 4-0-0 |
| | కొట్టుట, ఎగురబోత | | 8 | 1 | 7-8-0 |
| | గింజలు, బొత్తు, కంప తోలుట | ¼ | ½ | | 1-4-0 |
| | మొత్తము | 6¼ | 17 | 19 | 48-0-0 |

రాబడి

| | రు.అ.పై |
|---|---|
| కందులు 450 పౌ. (50 కుం.) | 60-0-0 |
| బొత్తు 900 పౌ. (¾ బండి) | 18-0-0 |
| కంప 1800 పౌ. (1½ బండి) | 12-0-0 |
| మొత్తము | 90-0-0 |
| నికరలాభము ... ... | 42-0-0 |

## 6. ఉపయోగము

దక్షిణ ఇండియాలో ముఖ్యముగ శాకాహారులు నిత్యమునువాడు పప్పు దినుసులలో కంది ప్రధానమయినదని చెప్పవచ్చును. కందుల సంఘటనము నితర ఖాద్యధాన్య జాతులతో బోల్చి 1 వ యనుబంధమున

తెలుపబడెను. కంది తక్కిన కాయధాన్యములకంటె సులువుగ జీర్ణమగును, ఇందుక వేడిజేయును. ఇందలి మాంసకృత్తులు తక్కిన కాయధాన్యజాతు లందలి మాంసకృత్తులకంటె హెచ్చుగ శరీరమునకు వంటబట్టునని కనుగొనబడెను. (1వ యనుబంధము నందలి కడపటి వరుస చూడుడు). కందులలో విటమిను $B_1$ పరిమితి ఒక సోయచిక్కుడు తప్ప తక్కిన కాయధాన్య జాతు లన్నిటిలో కంటె హెచ్చు[13]. విటమిను $B_2$ కూడ మెండుగ గలదు. విటమిను A పరిమితి మధ్యమము.

సామాన్యముగ కందిగింజలను వేచి విసరి పప్పుచేసి యుడికించి యన్నముతో గలిపి నేయి గూడ జేర్చి తిందురు. తమిళ దేశమున వేచని గింజలను విసరి తయారుచేసిన పప్పునే యుపయోగింతురు. వీరలీ పచ్చిపప్పును హెచ్చు నీటితో నుడికించి పైనీటిని(కట్టును)చారు(రసము)లోను, మెత్తగ నుడికిన పప్పును చాల వరకు పులుసు (కొళంబు లేక సాంబారు) నందును జేర్చి స్వల్పభాగమునే యన్నముతో కలిపి తిందురు. కంది పప్పును బియ్యముతో జేర్చి పులగముగ వండి తినుటయు గలదు. అరటికాయ, తోటకూర, మామిడికాయ మొదలగు వానితో గలిపి పప్పుకూర గాని పులుసు గాని చేయుట గలదు. కాని పులుసుతో నుడికిన పప్పు జీర్ణమగుట కష్టము. పచ్చి కంది గింజలను వంకాయ మొదలగు నితర కూరలతో గలిపి వండిగాని, ప్రత్యేకముగా సాతాళించిగాని తినవచ్చును. వేచిన కందిపప్పును పొడుము చేసి కొంత యుప్పును, కారమును కలిపి వ్యంజనముగ నుపయోగించుట కూడ చాలచోట్ల గలదు. కందిపప్పును కొంచెము నీటితోరుబ్బి పచ్చడి చేయుటయు గలదు. నానబెట్టి రుబ్బిన పిండిని వడలు లేక గారెలుగ చమురునందు వేయించి తినుటయు గలదు. మొలక కట్టిన కందుల వట్లే గాని కొంచెము బెల్లము మొదలగునవి కలిపి గాని తినవచ్చును. అపుడు విటమిను $C_1$ కూడ లభించును.

కందికట్టునందలి మాంసకృత్తులు సులభముగ జీర్ణమగుటచే జబ్బుపడి తేరినవారికి బలము చేయుటకై వైద్యులు చికెన్‌బ్రాత్ (*Chicken broth*) మొదలగు మాంస సంబంధమగు ద్రవములను దీసికొన నిష్టపడని వారికీ కందికట్టు నిత్తురు.

వేచిన కందులను విసరు నపుడు పొట్టు సులభముగ వీడిపోవును. పచ్చి పప్పును తయారుచేయు నపుడు పొట్టు వీడవలెనని గింజలను బాగుగ నెండబెట్టవలెను. కొన్నిచోట్ల కందులను ముందు ఎర్రమంటితో కలిపి నీటిలో నొక రాత్రి నాననిచ్చి పిమ్మట నెండబెట్టుదురు. పొట్టు సులభముగ వీడుటకు సహాయపడినను పప్పు ఉడుకుటకు కొంత యవరోధము గలుగునని కనిపెట్టబడెను14.

పప్పు శీఘ్రముగ నుడుకుటయు, నుడకక పోవుటయు చాలవరకు దాని నుడికించుట కుపయోగింపబడు నీటియందు కరగి యుండు లవణముల స్వభావమును, పరిమితిని బట్టి యుండును. సామాన్యపు ఉప్పు (సోడియముహారిదము)గాని, ఉదజహారికామ్లము గాని, ఖటికముగ్న సంబంధమగు లవణములు గాని ఉడుకుట కవరోధము కలిగించును. సోడాపొడి, సోడియకర్బనితము ఉడుకుటకు సహాయపడును. చమురు పదార్థములు హెచ్చుగా నుండు రకముల పప్పు ఉడుకుట కష్టము14. కొంతవర కిది రకపు స్వభావమును బట్టియు, అది యుత్పత్తి యగు ప్రదేశము నందలి పరిస్థితులను బట్టియు గూడ నుండవచ్చును.

కంది పొట్టు (గింజల పై పొట్టు)ను కంది బొత్తు (ఆకులు, కాయల పై డిప్పలు వగైరా)ను పశువుల కాహారముగ నుపయోగించును. కంది బొత్తు సంఘటనము 1 వ యనుబంధమున జూపబడెను. ఇది తృణధాన్య జాతుల దంటు కంటె బలము చేయును. కంది పొట్టు సంఘటనము తెలుపు అంకెలు లభింపలేదు.

కంది కంప వంట చెరకుగను, దడులు కట్టుట మొదలగు నితర పనులకును నుపయోగించును. కళ్లములను తుడుచు పొలికట్టలకీ కంప యనుకూలము. కంది పుల్ల దంతధావనమునకు వీలయిన వానిలో నొకటి. కాని అంత ప్రశస్తముగ నెంచబడుట లేదు. 'కనీసం కందిపుల్ల' అని సామెత. కందిబొగ్గు తేలికగ నుండుటచే నీ బొగ్గుపొడుము మందుగుండు సామానులం దుపయోగింపబడు చున్నది.

# 5. కోత, కైలు వగైరా

సెనగ మొక్కలను వేళ్లతో లాగి యెండనిచ్చి పెసర చేలవలెనే నూర్చెదరు. ఇట్లు లాగిన రానిచోట్లను, వేళ్ళు మంటితో వచ్చుచోట్లను కొడవళ్లతో గోయుట మంచిది. నూర్చిన గింజలను బాగుగ నెండబెట్టి నిల్వ చేయవలెను. కంది, పెసర మొదలగువాని విత్తులవలెనే సీసాలలో బోసి గాలి తగులకుండ కాపాడినచో బాగుగ నెండిన సెనగ గింజలు గూడ అధమము 5 సంవత్సరముల వరకు చైతన్యమును గోలుపోవని పరిశోధన వలన తేలెను[5].

ఆంధ్రదేశమున ననుకూల పరిస్థితులలో సామాన్యముగ నెకరమునకు సుమారు 50-70 కుంచముల * సెనగ లగును. **100** కుంచములు మంచి పంటగ నెంచవచ్చును. ఉత్తర హిందూస్థానమున నింతకంటె పంట హెచ్చు. సగటున రమారమి **100** కుంచముల (**850** పౌనుల) వరకుండును. బొంబాయి రాజధానిలో నీరు పెట్టి సాగు చేసిన సస్యము సగటున నెకరమునకు సుమారు **1,200** పౌనుల వర కిచ్చునట. ఇండియాలో మొత్తము మైన సగటు పంట సుమారు **688** పౌనులని లెక్కవేయబడెను. పూసాలో నొక తణిఖీలో సామాన్యపు రకము ఎకరము 1కి సుమారు **330** పౌనుల మాత్రము అయిన నేలలో నెంపుడు వంగడ మొకటి యెకరమునకు సుమారు **1,200** పౌనులును, సామాన్యపు రకము సుమారు **1,200** పౌనులు అయిన నేలలో మరియొక యెంపుడు వంగడము యెకరమునకు సుమారు **2,700** పౌనులకు మించిన పంటను ఇచ్చెనట[18].

---

* సెనగలు కుంచము 1కి సుమారు $8\frac{1}{2}$ పౌనులు తూగును.

ఒక యెకరము సెనగ సాగున కగు వ్యయమును, అందువలన సామాన్యముగ రాదగు నాదాయమును నీ క్రింద యంచనా వేయబడెను.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు | | | వ్యయము |
|---|---|---|---|---|---|
| | | ప.జ. | మ. | ఆ.‡ | రు.అ.పై |
| అక్టోబరు | దుక్కి-2సార్లు | 3 | 3 | | 12- 0-0 |
| | గుంటక తోలుట-1సారి | ½ | ½ | | 2- 0-0 |
| నవంబరు | దుక్కి-1సారి | 1½ | 1½ | | 6- 0-0 |
| | గుంటక తోలుట | ½ | ½ | | 2- 0-0 |
| | విత్తులు-8 కుంచములు (25 పౌనులు) | | | | 6- 4-0 |
| | విత్తుట నాగటిచాలున | 1 | 1 | 2 | 5- 0-0 |
| | గొప్పు, కలుపుతీత (అవసరమగుచో) | | 1 | 12 | 7- 0-0 |
| ఫిబ్రవరి | తీత లేక కోత | | ½ | 8 | 4- 8-0 |
| | నూర్పిడి, యెగురబోత | ½ | 1½ | ½ | 3- 4-0 |
| | గింజలు యింటికి తోలుట | ⅛ | ¼ | | 0-10-0 |
| | మొత్తము | 7⅛ | 9¾ | 22½ | 48-10-0 |

| రాబడి | రు.అ.పై |
|---|---|
| సెనగలు 500 పౌ. (సుమారు 60 కుంచములు) రు. 1కి 25 పౌ. ల చొప్పున | 80- 0-0 |
| నికరాదాయము | 31-6-0 |

‡ ప.జ.=పశువుల జతలు; మ.=మగవాండ్రు; ఆ.=ఆడువాండ్రు.

## 6. ఉపయోగము

సెనగపప్పు, కంది, పెసరపప్పుల వలెనే యీ ప్రాంతములందు నిత్యోపయోగమున నంతగా లేదు. కాని ఉత్తర హిందూస్థానమున హెచ్చుగ నుపయోగింపబడు చున్నది. ఈ ప్రాంతము లందు పప్పును పిండియు బూరెలు, ఒబ్బట్లు, బూంది, మిఠాయి, మైసూరుపాకు మొదలగు పలువిధముల వంటకములలో నుపయోగింపబడు చున్నవి. సెనగలను సాతాలించి అంగళ్లలో కారపుసెనగలను పేర నమ్ముటగలదు. కొంచెము నానబెట్టిన పప్పును గుల్లగ నుండునట్లు దయారుచేసి వేచి యమ్ముటయు గలదు. సెనగ కాయలను కాల్చిన నందలి గింజలు తినుట కనుకూలముగ నుండును. ఇటీవల నపక్వాహారులు కొందరు సెనగలను నానవేసి మొక్క కట్టి యుట్లే తినుచున్నారు.

సెనగల సంఘట్టనము 1 వ యనుబంధమున దెలుపబడెను. పెసర, మినుము, కంది కంటె సెనగలో మాంసకృత్తులు కొంచెము తక్కువగ నుండునని యందలి యంకెలు సూచించును. కాని సెనగలందలి మాంసకృత్తులు వానిలోకంటె హెచ్చు భాగము వంటబట్టునని కనుగొనబడెను. పెసలలోని మాంసకృత్తులలో సుమారు నూటికి 51 వంతులును, మినుము నందలివి 64 వంతులును, కందిలోనివి 74 వంతులును వంటబట్టునవిగ యుండ సెనగలో 76 వంతు లుండునని లెక్క వేయబడెను[13]. సెనగలో తక్కిన మాటిలో కంటె చమురు హెచ్చుగ నుండును. మొత్తపు యింధనశక్తియు కొంచెము హెచ్చు. ఖనిజ ద్రవ్యముల విషయమున తక్కిన మాటికిని సెనగలకును వ్యత్యాసమంతగా గానరాదు. విటమిను A వానిలోకంటె హెచ్చు. $B_1$ కొంచెము తక్కువ. $B_2$ సమానమని చెప్పవచ్చును. మొలక కట్టిన గింజలలో వానిలో వలెనే విటమిను C కొంత జనించును.

సెనగ చిగుళ్ల నెండబెట్టి నిల్వ చేసి చింత చిగురు వలె పచ్చడిచేసి యుపయోగించుట గూడ కొన్నిచోట్ల గలదు.

సెనగ చేలనుండి 'సెనగపులుసు' అనబడు వొక విధమగు ద్రావకము దీయుట గలదు. పూర్వ కాలమున తెల్లవారుజామున సెనగ చేనిపై

పరిశుభ్రమయిన నూలుగుడ్డను పరచి లాగినయెడల నా గుడ్డ మొక్కలపై నుండు మంచు తడితో పాటు ఆకు లందలి పులుపు ద్రవ్యమును గూడ పీల్చుకొనును. గుడ్డను పిండి యా పులుసు నీటిని కాచి చిక్కబరచి సీసాలలో బోసిన యెడల నా ద్రావకము చెడిపోకుండ చిరకాలముండును. దీనికే సెనగ పులుసు అని పేరు. ఇది శూల నొప్పులకును, పైత్య రోగములకును ఔషధముగ నుపయోగింపబడు చున్నది.

నానవేసిన సెనగలను గుర్రములకు తరచు దాణాగా పెట్టుచుందురు. సెనగ బొత్తును సామాన్యముగ పశువులు తినవు. కొంచెము పులుపుగ నుండుటయే యిందుకు గారణము.

సెనగ పొట్టు పశువులు బాగుగ దినును. ఒక నమూనాలో తేమను మినహాయించి లెక్కగట్టుచో నిందు సుమారు నూటికి 5.94 వంతులు మాంసకృత్తులును, 6.51 వంతులు బూడిదయు, 1.82 వంతులు చమురును, 50.88 వంతులు నారపదార్థమును, 35.41 వంతులు కర్బనోదజనిదములును ఉండెను. మరియు నిందలి మాంసకృత్తులలో జీర్ణమగు భాగము మిగుల స్వల్పమయినను, మొత్తపు పోషకశక్తి గోధుమ పొట్టు కంటె కొంత తక్కువైనను పంజాబులో దీనిని, గోధుమ పొట్టును వేరు సెనగ పిండితో పశువులకు బెట్టి పరీక్షింపగా మొత్తముమీద గోధుమ పొట్టుతో సమముగనే బలము చేసెనని గనుగొనబడెను[10].

## 7. సెనగల యుత్పత్తి - వ్యాపారము

ఇండియాలో మొత్తముమీద సుమారు 38 లక్షల టన్నుల సెనగ లుత్పత్తి యగుచున్నవి. ఇందు మూడవ వంతుకుపైగా ఉత్తరప్రదేశ్ యందే పండుచున్నవి. తూర్పు పంజాబు, మధ్యప్రదేశ్, పెప్సూ, మధ్యభారత్ రాష్ట్రములు వరుసగా దీని తరువాతివి. చెన్నపురి రాజధానియందు సెనగల యుత్పత్తి చాల తక్కువ. సుమారు 24 వేల టన్నులుండును. ఇందు 21వేల టన్నులాంధ్రదేశమందే యుత్పత్తి యగుచున్నవి[1]. అయినను యివి చాలక ఉత్తరహిందూస్థానమునుండి చాల సరకు దిగుమతి యగుచున్నది.

# అనుము

## *Field bean - Dolichos lablab*

అరవము-మొచ్చై; మళయాళము-మొచ్చకొట్టై; కన్నడము-అవరె; ఓఢ్రము-బైరో; హిందుస్థానీ-షీమ్; సంస్కృతము-ఖల్వః.

## 1. చరిత్ర, వ్యాపకము

పెసర వలెనే దీనికిని ఆసియాఖండ మందలి యుష్ణ మండలము లునికిపట్టు. ఇండియాలో నిది వన్యస్థితి యందు గానన గును. కావున నీ దేశమే యీ జాతి కాదిమస్థానమయి యుండవచ్చును[21]. మరియు నిది యీ దేశమున ప్రాచీనకాలము నుండియు సాగునందుండె ననుటకు నిదర్శనముగ యనుముల పేరు (ఖల్వాః) బృహదారణ్యకోపనిషత్తునందు పేర్కొనబడిన దశధాన్యములలో జేరి యుండుటయే నిదర్శనము.

ఇండియానుండియే అనుము చీనా, పడమటిఆసియా, ఈజిప్టు దేశములకు జేరియుండ వచ్చునని యూహింపబడు చున్నది. ఇపు డిది పూర్వార్ధగోళము నందలి అతి తేమగాలేని ఉష్ణప్రదేశము లన్నిటి యందును కొద్ది గొప్ప సాగు చేయుబడు చున్నది[21].

ఇండియాలో అనుము విస్తారముగ సాగు చేయబడు రాష్ట్రము మధ్య పరగణాలు. బొంబాయి రాజధానిలోను, బీరారు నందును, చెన్న రాజధానిలోను కూడ కొంత వరకు సాగు చేయుబడు చున్నది. కాని యిది ఇండియాలో నాయా రాష్ట్రములందు సాగు చేయబడు విస్తీర్ణము

లెక్కలలో ప్రత్యేకింపబడుట లేదు. ఐననుయీ రాజధానిలో నిదిసుమారు 70 వేల యెకరముల వర కుండవచ్చునని యొకప్పు డంచనా వేయబడెను. తెలుగు జిల్లాలలో నీ సాగు విస్తారముగ గలవి బళ్ళారి, కడప. తక్కిన వానిలో స్వల్పముగ సాగు చేయబడుచున్నది.

## 2. మొక్కయొక్క స్వభావము, రక భేదములు

అనుప మొక్క యనేకములగు కొమ్మలను బెట్టి గుబురుగ నెదుగును. తల్లికాడ యొక్కయు, కొమ్మల యొక్కయు కొనలు కుదరు తీగలుగ

22 వ పటము



అనుప మొక్క

సాగు స్వభావము కొంత గలదు. తల్లికాడ యిట్లు సుమారు రెండు గజములకు పైబడియు కొమ్మలు గజమునకు పైబడియు సాగుట గలదు.

ఆశ్రయ మేదేని దొరికిన యెడల దానిపై నెగ్రాకును. కేవలము తీగెలుగనే ప్రాకు కొన్ని చిక్కుడు రకములు గూడ వృక్షశాస్త్రరీత్యా ఈ యనుప జాతిలోనే చేరును.

అనుప వేరు కంది మొక్క వేళ్లంత లోతుగ బారకపోయినను పెసర, మినుము వేళ్లకంటె హెచ్చు లోతుగ పోవును. కాండము ఆకుపచ్చగ గాని, కొంత ఊదారంగు లేక అట్టి మచ్చలతో కూడ గాని యుండవచ్చును. పెసర, మినుముల కాండము కంటె లావెక్కును. లేత కాండము పైని రోమములు మెండుగ నుండును.

23 వ పటము



అనుపయాకు ($\frac{1}{2}$ ఆకృతి)

ఆకులు పెసరలోవలెనే మూడేసి యుపదళములు గలిగియుండును. పరిమాణమున నివి కొంచె మించుమించు పెసరయాకు నందలి యుపదళములం తేసి యుండును. వెడల్పు కొంచె మెక్కువ. కొన్ని రకములలో

నాకులు రోమయుతముగ నుండును. అట్టివి లేత ఆకుపచ్చ రంగుగ గనబడును. కొన్ని రకములలో నాకుల యీనెలందు గాని, అంతటను గాని యీ యాకు పసరు వర్ణముతో కొంత యూదారంగు మిశ్రితమయి యుండును.

పూవులు నిడివిగ నెరుగు గెలలుగ నుండును. ఈ గెలలు తల్లికాడ చివర గాని, కొమ్మల చివర గాని బయలుదేరక వాని కణుపులందు ప్రత్యేకపు రెమ్మలుగ బయలుదేరును. ఒక్కొక్క గెలలో నొక మధ్య కాడ యుండి దానిపైన పూవులచటచట చుట్టును బయలుదేరుచుండును. సెనగ, కంది పూవుల కంటె నీ పూవులు పెద్దవి. ఆకర్షకపత్రములు సామాన్యముగ తెలుపుగ నుండును. కొన్ని రకములలో నివి యూదా రంగు లేక కొంచె మెరుపుతో గూడిన యూదారంగు గలిగి యుండుటయు గలదు[21].

పూవులు పగ లంతయు విడచుచుండును. కాని విడుపు పూర్వాహ్ణము 11 గంటలనుండి సాయంకాలము 5 గంటల వరకు హెచ్చుగ నుండును. పూవులు విడచుటకు రెండు దినములు ముందుగనే లోని పుప్పొడి తిత్తులు పగిలి యండాశయములను గర్భవతులుగ జేయును. కావున ననుములో పర సంపర్కమున కవకాశము తక్కువ. కాని యరుదుగ పర సంపర్కము గలుగుట వలన బుట్టు సంకరపు గింజలు బయలుదేరుటయు గలదు.

గెలలో పుట్టిన పూవులలో చాలభాగము గర్భవతులయి గాని, కాకగాని రాలిపోవుచుండును. సామాన్యముగ సుమారు నూటికెనుబది వరకిట్లు రాలిపోవుచుండునని లెక్క వేయబడెను. ప్రతికూల పరిస్థితులందు హెచ్చుగ రాలిపోవుట గలదు[21].

పూతకాలమున అనుప చేలనుండి యొక విధమగు వాసన బయలుదేరును. ఇందుకు కారణము పూవుల గుత్తులందును లేత కాయల పైనను నట్టి వాసన గల చెమురు గ్రంథుల యునికియే.

కాయలు బల్లపరుపుగను కందిలోకంటెను వెడల్పుగను నుండును. పొడవు సుమారు $1\frac{1}{2}$-$2\frac{1}{2}$ అంగుళములును, వెడల్పు $\frac{3}{8}$-$\frac{5}{8}$ అంగుళములును ఉండును. పచ్చికాయ సామాన్యముగ ఆకు పచ్చగ నుండును. ఇందును. లేత ముదురు భేదములు కలవు. కాయపైన కొద్దిగొప్ప ఊదా రంగుండు రకములు గూడ గలవు.

24 వ పటము



అనుపకాయ
(పూర్ణాకృతి)

ఒక్కొక కాయలో 2-4 గింజ లుండును. ఇవి తక్కిన కాయ ధాన్యపు గింజల కంటె పెద్దవి. ఔన్సుకు సుమారు 100-120 గింజలు తూగును. సామాన్యముగ ఆంధ్ర దేశమున సాగు చేయబడుచున్న రకమున గింజ లేత గోధుమ వర్ణము గలిగి యుండును. గింజ ప్రాతగిలిన కొలదిని గోధుమ రంగు హెచ్చును. ఎరుపుతో గూడిన గోధుమ వర్ణపు గింజల రకములును కేవలము తెలుపు, నలుపు రకములును గూడ గలవు.

25 వ పటము



అనుపగింజ 2 రెట్లు

కోయంబత్తూరు క్షేత్రమున నెంచి తీయబడిన D. L. 281 అను వంగడము ఆ ప్రాంతములకు అనుకూలముగ గనబడెను. ఇటీవల నెం 44 రు (గోధుమరంగు గింజ) వంగడమును, నెం 92 రు (తెల్లగింజ) వంగడమును స్థానిక రకములకంటె హెచ్చు పంట నిచ్చునని తేలెను. ఇవి యింకను తణిఖీలో నున్నవి.

## 3. సాగునకు దగిన పరిస్థితులు

అనుపచేల పెరుగుదలకు ఉష్ణత కొంత యనుకూల మయినను పూతకును, కాపునకును కొంత శీతలము కావలయును. కాని శీతల మతిశయించుట మరల దీనికి నెబ్బరయే. ఇతర కాయధాన్యములకు వలెనే అతి వర్షములు

దీని పెరకువకు పనికిరావు. మబ్బులును, తూర్పుగాలియు సైతము పూతను రాల్పును. ఇట్టి పరిస్థితులలో కాయకు పురుగు గూడ పట్టును.

అనుమును సందర్భమును బట్టి జూన్ మొదలు డిసెంబరు వరకు చల్లవచ్చును. దత్తమండలములలో జూన్-జూలై నెలలలో చోడి, సజ్జ మొదలగు తృణధాన్యములతో కలిపి జల్లుదురు. కొన్ని చోట్ల ఆగష్టులో గూడ చల్లుదురు. విశాఖపట్నం, గోదావరి జిల్లాలలో సెప్టెంబరు-అక్టోబరు నెలలలో చోడి, జొన్న మొదలగు వానితో కలిపి చల్లుదురు. వరి చేలలో నీ సస్యము కోసిన పిమ్మట నవంబరు_డిసెంబరు నెలలలో జల్లుదురు. అనుము, పెసర, మినుము, ఉలవ కంటె నెక్కువ కాలము పెరుగును. సెప్టెంబరులో జల్లిన సస్యము సుమారు 3 నెలలు పెరిగిన పిమ్మట పూత ప్రారంభించును. ముందుగా జల్లిన చేలు పూత ప్రారంభించుటకు కొంచెము హెచ్చు కాలము పట్టును. వెనుకగ జల్లినవి కొంత త్వరలో బూయును. ఒకానొక తణిఖీలో డిసెంబరులో చల్లిన చేను ఆరు వారములలోనే బూసెను. కాని జనవరిలో విత్తినది తీగ పెసర వలె రొట్ట పెరిగి 41 వారములకు గాని పూయలేదు21.

అనుప చేలు పూత ప్రారంభించిన సుమారు 6-8 వారములలో కాయలు తొలిసారి కోతకు వచ్చును. కోత ప్రారంభించిన మరియొక నెల వరకు కాయలు క్రమముగ ముదురు చుండును. సెప్టెంబరులో చల్లిన సస్యము నేలపై నారు నెలలకు పైగా నుండును.

అనుము విస్తారముగ సాగు చేయబడు కడప, బళ్ళారి జిల్లాలలో వర్షము తక్కువగాన నిది సామాన్యముగ రేవడి నేలలో సాగు చేయబడు చున్నది. ఇతరచోట్ల గరుప నేలలోను, ఇసుక గరుములలోనుకూడ కొంత వరకు సాగు చేయబడు చున్నది.

## 4. సేద్య విధానము

అనుము మిశ్రణముగను, ప్రత్యేకముగను గూడ సాగు చేయబడు చుండును. దీనితో కలిపి సాగు చేయబడు ముఖ్య తృణధాన్యములు

జొన్న, చోడి. ఇతర సస్యములలో అనుమను ముఖ్యమయినది. దీనితో పాటితర కాయధాన్యములుకూడ కలిపి సాగు చేయుటయు గలదు. బళ్ళారి జిల్లాలో ననుమును యితర కాయధాన్యములును మాత్రము కలిపి సాగు చేయుట గలదు.

మెట్ట నేలలో ప్రత్యేకముగ సాగు చేయు నెడల దీనిని మెట్టవరి, నూవు మొదలగు పునాస పంటలకు తరువాత సాగు చేయవచ్చును. గోదావరి జిల్లాలోని వండలి నేలలం దిట్లొక సంవత్సరము నూవును, పిమ్మట అనుమును సాగు చేసి మరుచటి సంవత్సరము మిరపతోట వేయుదురు. గరుపనాడి నేలలలో మిరపతోటకు బదులు మొక్కజొన్న+కంది పెట్టబడును. ఇసుక గరుములలో నీ మిశ్రణమునకు బదులు తొలకరిలో గంటె వేసిన పిమ్మట ఊలవ లేక బొబ్బర పెట్టుదురు. వరి నేలలలో అనుమును పునాస వరులకు పిమ్మట పెట్టుట మంచిది. ఇందు ప్రత్యేకముగ సాగు చేయుటయే సామాన్యాచారము.

అనుము, పెసర, మినుములకంటె నేలపై యెండలు ముదురు వరకుండుటచే యింత వరకు పదును నిలచుటకుగాను ఆ సస్యముల కంటె నేలను బాగుగ దున్ని తయారు చేయవలెను. విత్తులను సామాన్యముగ నాగటి చాలున వేయవచ్చును. వరిమళ్లలో విత్తినపు డొక్కొక్కప్పుడు యింకను లోతున వేసినగాని మొలవవని తోచినపుడు నాగటిచాలులో గనికతో పొడిచి వేయుదురు.

జొన్నతో మిశ్రణముగ విత్తుచో ననుమును 5 చాళ్ళ కొక చాలు చొప్పునగాని పది చాళ్ళ కొక చాలు చొప్పునగాని అక్కడి గొట్టముతో వేయుదురు. చాలు చోడితో గలిపి వేయుచో భూమి స్వభావము ననుసరించి దీనిని సుమారు 3-4 అడుగుల దూరమున కొక చాలున వేయవలెను. వెదజల్లు సస్యములతో గలిపి సాగు చేయ దలచుచో ముందా విత్తులను జల్లిన పిమ్మట నా పైరు స్వభావమును బట్టి సుమారు 3-6 అడుగుల కొక చాలున ననుమును విత్తవలెను. చాలులో సుమారొక యడుగున కొక గింజ చొప్పున వేయవచ్చును.

ప్రత్యేకముగ జల్లునెడల 4-5 కుంచముల ‡ విత్తులు పట్టును. బీద నేలలలో కొన్నిచోట్ల 6-8 కుంచములవరకు చల్లుటగలదు. మిశ్రణముగ వరుసల దూరమును బట్టి 1, 2 కుంచముల వరకు వేయవలసియుండును.

అనుమున కాంతరకృషి గాని, గొప్ప త్రవ్వి, కలుపు దీయుట గాని యరుదు.

పూతకాలమున ననుప చేలనుండి బయలుదేరు వాసనచే పసువులను తక్కిన సస్యములకంటె నీచేలు హెచ్చుగనాకర్షించును. దీనికి కంచెగాని, యితర ఆవరణగాని లేనిచోట్ల కొందరు పశువులను కొంత వర కాపుటకు అనుప చేల మిట్టును కుసుంబా గాని, జనుము గాని కొంత వెడల్పున జల్లుదురు.

అనుప చేలకు తరుచు ఒక విధమగు గొంగళిపురుగు (*Adisura Atkinsoni*) పట్టి యాకులను దినుచుండును. ఇది కాయలనుగూడ దొలచి గింజలను దినును. రెండు జాతుల పేను కూడ పట్టుట గలదు[11]. వీని వృద్ధికి తేమ గాలియు, మబ్బులును ప్రోత్సాహకరములు. నిల్వ యుంచిన యనుప గింజలకు నుసిపురుగు విస్తారముగ పట్టును. విత్తనపు గింజలను తరుచు గొండబోయు కుండలలో బోసి పైని పొడియిసుక లేక బూడిద దళముగ గప్పి యుంచవలెను.

## 5. కోత, కైలు వగైరా

అనుమును కంది, పెసర మొదలగువాని వలె మొదటి కొకేసారి గోయక ముదిరిన కాయల నప్పుడప్పు డేరుచు రావలెను. సామాన్యముగ నిల్లు 4-6 వారములవరకు ఏరుట యావశ్యము కావచ్చును. ఈ కాలమున కాపునుబట్టి సామాన్యముగ 2-3 కోతలు పడును. కాయ లన్నిటిని కోసి కొనిన పిమ్మట పశువులచే మేపి కాడను మొదటికి కోసివేయవలెను.

కోసిన కాయలను కళ్ళములో నెండబోసి కర్రలతో గొట్టి గాని, విస్తారముగ నున్న యెడల పశువులచే త్రొక్కించి గాని గింజలను చెరిగి గాలి కెగురబోసి శుభ్రము చేయవలెను.

‡ అనుములు కుంచము 1కి సుమారు 9 పౌనులు తూగును.

ప్రత్యేకముగ సాగు చేసి నప్పుడు సామాన్యముగ నెకరమునకు సుమారు 60-80 కుంచముల* గింజ లగును. సగటున 600 పౌనులు కావచ్చును. 900 పౌ. మంచి పంటగ నెంచవచ్చును. 1800 పౌ. వరకయినట్లు లెక్కలు గలవు. మిశ్రణముగ 20-40 కుంచములు గావచ్చును. కాయలను మాత్రమే గోసికొనుటచేత బొత్తు నందు కాయల డిప్పలు మాత్రమే జేరును. ఇవి నారవాటుగ నుండుటచే పశువులు బాగుగ దినవు. కావున బొత్తును లెక్కలోనికి దీసికొన విలువలేదు. కాయల కోత ముగిసిన వెనుక కాడను పశువులచే మేపుటయే ఆచారము. కాని చేను కురుచగ నెదుగు గొన్నిచోట్ల గొందరు చేయునట్లు కడపటిసారి కాయల నేరుటమాని మొదటికి గోసి యెండించి ద్రొక్కించుచో కొంత బొత్తగును.

ప్రత్యేకముగ తొలకరి నూవు కోసికొనిన పిమ్మట సాగుచేయుచో ఒక యెకరము అనుము సాగున కగు వ్యయమును, అందువలన సామాన్యముగ రాదగు నాదాయమును నీ క్రింద యంచనా వేయబడెను.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు | | | వ్యయము |
|---|---|---|---|---|---|
| | | ప.జ. | మ. | అ† | రు.అ.పై |
| సెప్టెంబరు | దుక్కి-2సార్లు | 3 | 3 | | 12-0-0 |
| | గుంటక తోలుట | ½ | ½ | | 2-0-0 |
| అక్టోబరు | దుక్కి-1సారి | 3½ | 1½ | | 6-0-0 |
| | గుంటక తోలుట | ½ | ½ | | 2-0-0 |
| | విత్తులు-40 పౌనులు | | | | 5-0-0 |
| | నాగటి చాలున వేయుట | ½ | ½ | ½ | 2-4-0 |
| జనవరి- | కాయలకోత | | | 12 | 6-0-0 |
| ఫిబ్రవరి | కాడకోత, తీసివేత | | ½ | 4 | 2-8-0 |
| | కొట్టుట,ఎగురబోత,గింజలమోత | | 2 | 1 | 2-4-0 |
| | మొత్తము | 8 | 8½ | 17½ | 40-0-0 |

* అనుములు కుంచము 1కి సుమారు 9 పౌనులు తూగును.

† ప.జ.=పశువుల జతలు; మ.=మగవాండ్రు; అ=ఆడువాండ్రు.

| రాబడి | | రు.అ.పై |
|---|---|---|
| | గింజలు-600 పౌనులు, రు 1కి 36 పౌ. చొ॥ | 6[illegible]-10-8 |
| | రొట్టె విలువ | 1[illegible]- 0-0 |
| | మొత్తము | 78-10-8 |
| | నికరాదాయము ... ... | 38-10-8 |

చోడితో మిశ్రణముగ సాగు చేయు నెడల వ్యయమును, ఆదాయమును నీ క్రింది విధముగ నుండవచ్చును.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు ప.జ. | మ. | ఆ. | వ్యయము రు.అ.పై |
|---|---|---|---|---|---|
| అక్టోబరు | విత్తులు-12 పౌనులు | | | | 2- 4-0 |
| | నాగటిచాలున వేయుట | ¼ | ¼ | ¼ | 1- 2-0 |
| | కాయలకోత, మోత | | 1 | 6 | 4- 0-0 |
| | కాడకోత | | | 3 | 1- 8-0 |
| | మొత్తము | ¼ | 1¼ | 9¼ | 8-14-0 |

| రాబడి | | రు.అ.పై |
|---|---|---|
| | గింజలు-250 పౌనులు | 28-0-0 |
| | రొట్టె విలువ | 6-0-0 |
| | మొత్తము | 34-0-0 |
| | నికరాదాయము ... ... | 25-2-0 |

## 6. ఉపయోగము

అనుములను కంది, పెసర వలె పప్పుగ వండి అన్నముతో తినుట గాని, మినుము వలె వంటకములలో నుపయోగించుట గాని యరుదు. సామాన్యముగ నీయనుపగింజలను కొంచెముప్పుతో నుడకబెట్టి గుగ్గిళ్ళుగ

గాని, సాతాళించి గాని తిందురు. ఇవి తరుచు కారపు సెనగల వలె వంగళ్లలో నమ్మబడుచుండును. ఎండు గింజలను నానవేసి గాని, పచ్చి గింజలనే గాని వంగ మొదలగు నితర కూరలతో గలిపి యుపయోగింతురు.

అనుపగింజల సంఘటనము I A, B యనుబంధములలో తెలుపబడెను. మాంసకృత్తులు వగైరాల పరిమితిలో నివి మినుముతో తుల్యముగ గానబడును. కాని సామాన్యముగ తక్కిన కాయధాన్యము లంత యారోగ్యవంతముగ నెంచబడుట లేదు. ఇందు స్ఫురము హెచ్చుగ నున్నను, సున్నమును, ఇనుమును చాల తక్కువ. విటమిను $A, B_1, B_2$ లు కూడ కొంచె మించు మించు మృగ్యము. మరియు అనుములు పైత్యము చేయు నందురు. అనుప గుగ్గిళ్లను పశువులకు కూడ దాణాగా పెట్టుచుందురు.

79 వ పుటలో వ్రాయబడినట్లు ప్రత్యేకముగ దయారు చేయబడు అనుప బొత్తు (ఆకుల పొట్టు) పశువులకు మిగుల ప్రీతి. బొత్తు సంఘట్టనము 1 D యనుబంధమున తెలుపబడెను.

అనుపకాడను వంట సరకుగ నుపయోగింప వచ్చును. లేక పేడ గోతిలో వేసి చీకనిచ్చి యెరువుగ నుపయోగింప వచ్చును.

# సోయ అనుము

## Soy bean - Glycine soja

### 1. చరిత్ర, వ్యాపకము

సోయ అనుమున కాదిమ స్థానము ఆసియాఖండపు తూర్పు భాగమని యెంచబడుచున్నది. చీనాలో నిది **5,000** సంవత్సరముల క్రితము నుండియు సాగునం దుండెనట[22]. సోయ అనుము **1804** వ సంవత్సరమున అమెరికాలోని సంయుక్త రాష్ట్రములలోను 19వ శతాబ్ద ప్రారంభమున పిమ్మట ఐరోపాఖండమునను ప్రవేశపెట్టబడెను.

ఇపుడిది చీనా(తూర్పుభాగమున), మంచూరియా(ఇపుడు మంచూకువో), మంగోలియా, కొరియా, జపాను మొదలగు ప్రాచ్యదేశములందు విరివిగ సాగు చేయబడుచున్నది. పశ్చిమదేశములలో అమెరికా సంయుక్త రాష్ట్రములందు గూడ దీని సాగు ఇటీవల చాల విస్తరించెను. కొంతవరకు కనడాలోను స్వల్పముగ ఐరోపాఖండమందలి బాల్కన్ రాష్ట్రములు, జర్మనీ, ఇటలీ, ఫ్రాన్సు మొదలగు వానిలోనుగూడ సాగు చేయబడుచున్నది. ప్రపంచమునందలి సోయ అనుప పంటలో సుమారు మూడవ వంతు మంచూరియాలోనే యుత్పత్తి యగుచున్నది[23]. **1935** వ సంవత్సరమున అమెరికా సంయుక్త రాష్ట్రములందు సుమారు **50** లక్షల యెకరములపై నిది సాగునం దుండెను[22].

ఇండియాలో గూడ నీ సస్యము సుమారు ఏబదియేండ్ల క్రిందటనే పరీక్షింపబడెను. ఇపుడిది పర్వతప్రాంతములగు వంగదేశము నందలి యుత్తర భాగము(డార్జిలింగుజిల్లా) నందును, నేపాల్, భూటాన్, సిక్కిమ్ సంస్థానము లందును కొంతవరకు సాగునం దున్నది. విస్తీర్ణము సుమారు **20** వేల యెకరములపై యుండునని యంచనా వేయబడుచున్నది[23]. కాని సమ

ప్రదేశములందిది యింకను నంతగా వ్యాపకమునకు రాలేదు. ఇటీవలననే యనగా గతించిన శతాబ్దమునందు దీని కితర దేశములందు గలుగుచున్న గౌరవమును, ప్రోత్సాహమునుబట్టి యీ దేశమున గూడ దీనిని గురించి కొంత ప్రబోధమును పరిశోధనయు జరిగెను. ఐనను నీ దేశమున దీని సాగు ప్రారంభదశలోనే యున్నదని చెప్పదగును.

## 2. మొక్కయొక్క స్వభావము, రకభేదములు

సోయ అనుము సుమారు 1½-2 అడుగుల యెత్తు వరకు పెరుగు చిన్న మొక్క. కొన్ని రకములు సుమారు 5-6 అడుగుల యెత్తు వరకు పెరుగుట

31వ పటము



సోయ అనుము మొక్క (½ ఆకృతి)

గలదు. అనుము వలె కొనలు తీగవలె ప్రాకు స్వభావము గలిగియుండు రకములు గూడ గలవు.

వేరు సామాన్యముగ అనుప వేళ్ళ వలెనే పెరిగ, మినుము కంటె లోతుగ బోవును. ప్రక్కలకు గూడ విస్తరించును. కాండము చాల జాతులలో నిలువుగ నుండును. కొన్ని రకములలో కొమ్మలు అన్నివైపులకును సమముగ వ్యాపింపక రెండు వైపులకు మాత్రమే వ్యాపించు స్వభావము గలిగి యుండును.

27 వ పటము



సోయ అనుపయాకు ($\frac{1}{2}$ ఆకృతి)

ఆకునందలి యుపదళములు బొబ్బరలో వలె యించుక విడివిగ గాని, అనుములో వలె నించుక వెడల్పుగ గాని యుండు రకములుగలవు.

పరిమాణమునందు ఉలవయాకంత చిన్నవి మొదలు బొబ్బరయాకంత పెద్దవివరకు గల రకములు గలవు. ఆకులపై చాలవరకు రోమములుండును. కొన్ని రకములలో కాయలు ముదురవచ్చుటికి ఆకులు రాలిపోవును. పూవులు ఆకు పంగలలో మొక్కకు క్రింది భాగమునుండియు గుత్తులుగ బయలుదేరును. ఆకర్షకపత్రములు తెల్లగగాని, ఊదారంగు గలిగిగాని యుండును. పూవులు సామాన్యముగ ఆత్మసంపర్కము వలననే గర్భవతు లగును.

కాయలు ఉలవ కాయలను బోలి సుమారు 1½-2½ అంగుళముల పొడవుండును. కాని యించుక వెడల్పుగ నుండును. కొన్ని రకములలో చిన్న యనుపకాయలంత వెడల్పుగ నుండుటయుగలదు. కాయలపై తెల్లగగాని, పసిమితో గూడిన కపిలవర్ణము గాని గలిగి యుండు నూగు హెచ్చుగ నుండును.

గింజల రంగు నందును, ఆకార పరిమాణము లందును చాల భేదములు గలవు. చాల రకములలో నివి కొంచె మించు మించు తెల్లగ నుండును. పసిమి, గోధుమవర్ణము, పసరు, ఊదాతో గూడిన నలుపు, వీని మిశ్రణములును గల రకములు గలవు. కొన్ని కంది గింజవలె గుండ్రముగ నుండును. కొన్ని బొబ్బరగింజవలె కోలగనుండును. కొన్ని అనుపగింజవలె కొంత బల్లపరుపుగ నుండును. పెద్ద మినుపగింజలంతేసి మొదలు మధ్యమ పరిమాణము గల కందిగింజ లంతవరకుండి పౌన్నుకు 200-500 వరకు తూగు రకములు గలవు.

పైని వివరింపబడిన లక్షణములనుబట్టియు, ఫలించుకాలము మొదలగు నితర లక్షణములను బట్టియు సోయ అనుములో ననేక రకములు గుర్తింపబడుచున్నవి. అమెరికాలో 188 రకములు లెక్క వేయబడెను. ఈ రాజధానిలో నిటీవల 60 రకములవరకు పరీక్షింపబడినవి[24]. అందు బెహ్రూమ్ (*Behrum*), పెంగిపె (*Pe Ngype*) అను రెండు రకములు మాత్రమే మేలుగ గనబడుచున్నవి. వానిని గురించిన వివరములు ఈ క్రింద తెలుపబడెను.

1. బెహ్రూమ్ (*Behrum*) :— ఇందు మొక్క వెడల్పయిన యాకులు గలిగి యుండును. అంతటను నూగు హెచ్చుగ నుండును. కాయలు చాలవరకు కొమ్మల దిగువ భాగముననే యుండును. గింజ బొబ్బరగింజ యాకారమున పసిమిరంగు గలిగి పెద్దదిగనుండును. ఔన్సుకు సుమారు 240 గింజలు తూగును. జూన్ నెలలో జల్లిన సుమారు 5 నెలలలో పంటకు వచ్చును. సెప్టెంబరులో జల్లిన నాలుగు నెలలలోనే ఫలించును.

2. పెంగిపె (*pe Ngype*) :— ఇందు ఆకులు చిన్నవిగ నుండును. నూగు తక్కువ. కాయలు కొమ్మ లంతటను నుండును. గింజ చిన్నది. ఔన్సుకు సుమారు 480 గింజలు తూగును. పై రకము కంటె నిది సుమారు 15 దినము లాలస్యముగ ఫలించును.

## 3. సాగువకు దగిన పరిస్థితులు

సోయ అనుము సమశీతోష్ణ మండలపు జాతి యయినను దీని నుష్ణ మండలమున కొంతవరకు పైరుచేయ వీలగుచున్నది. కాని యిదంత బాగుగ గాని, నమ్మకముగ గాని ఫలించునని చెప్ప వీలులేదు.

ఆంధ్రదేశమున దీనిని మెరకనేలలలో తొలకరిని (జూన్-జూలై-ఆగష్టు నెలలలో) గాని, వర్షములు ముగియుటకు ముందు (సెప్టెంబరు-అక్టోబరు నెలలలో) గాని విత్తవచ్చును. మాగాణి భూములలో వరికోతలయిన వెనుక దీనిని పెసర, మినుము మొదలగు వాని వలె సాగు చేయుటకు వీలుపడునట్లు తోచదు. తోట భూములలో నన్ని కాలము లందును సాగు చేయ వీలగును.

సోయ అనుమునకు గరువ నేల లనుకూలములు. ఇసుకజేరని బంక గరువములలోను, సత్తువైన యిసుక గరువములలోను గూడ సాగు చేయవచ్చును. డెల్టాలలోని వండలి భూములలో నిది బాగుగ బెరుగును. ఈ సస్యము బాగుగ నెదుగుటకు మొక్కల వేళ్ళపై బెరిగి బొడిపెలకు

బుట్టించి యందు నివసించుచు వాయువునుండి నత్రజనిని సేకరించి యొసగ గల జాతి సూక్ష్మజీవులు నేలయం దుండుట యవసరము. కొన్నిచోట్ల నీ సస్యము బాగుగ పెరుగక పోవుటకు వీని లేమియే కారణము గావచ్చును.

## 4. సేద్య విధానము

సోయ అనుమును మెరక నేలలో అనుము వలెనే తొలకరిలో నేపంటను దీయని నేలలలో ప్రధాన సస్యముగ గాని, నువ్వు, గంటె మొదలగు వానిని గోసికాని నేలకు గొంత సత్తువ చేసి రెండవ పంటగ గాని పెట్టవచ్చును. వరిమళ్లలో కోతలకు బిమ్మట బెట్టిన సస్య మెచటగాని బాగుగ బెరిగినట్లు గాన్పింపదు. సామాన్యముగ దీనిని ప్రత్యేకముగనే సాగు చేయదగును. ఇతర సస్యములతో గలిపికూడ పైరుచేసి చూచి యనుభవముపై నెట్టి మిశ్రణము లనుకూలముగ నుండునో యింకను నిర్ణయింప వలసియున్నది.

అకాలభంగము కలుగకుండ తగినంత పంట పండవలెనన్న సోయ అనుము విత్తునేలను తగినంత ముందుగ దుక్కి ప్రారంభించి బాగుగ తయారు చేయవలెను. మూడు నాలుగు సార్లయినను దున్నుట మంచిది. సత్తువ నేలలలో నెరువు వేయ నగత్య ముండదు. నీరసపు భూములకు 10-12 బండ్ల పశువుల యెరువును దుక్కికి ముందే పరచవలెను. నేల యొక్క సత్తువను బట్టియు, రకపు పెరకువను బట్టియు విత్తుల కెకరమునకు సుమారు 10-20 పౌనుల చొప్పున జల్లవచ్చును. ప్రక్కలకు వ్యాపించి పెద్ద మొక్కలుగ పెరుగు రకములను పలుచగను, చిన్నవిగను నిలువుగను పెరుగు వాని నొత్తుగను చల్లవలెను. వెదజల్లుట కంటె నాగటి చాలువ గాని, గొర్రుతో గాని వేయుట మంచిది. సుమారు $1\frac{1}{2}$-2 అడుగుల దూరము గల వరుసలో గింజలను 6-9 అం. దూరమున వేయవచ్చును. $1\frac{1}{2}$ అడుగు దూరమున నుండు వరుసలలో 6 అంగుళముల కొక గింజ వేయుచో సుమారు 20 పౌనుల గింజలు పట్టును. 2 అడుగుల దూరము గల వరుసలలో 9 అంగుళముల కొక గింజ విత్తుచో 10 పౌనుల విత్తులే

చాలును. అమెరికాలోను, జపానులోను సుమారు 15-40 పౌనుల వరకు వేయుట గలదు.

సోయ అనుప గింజలలో నీటిలో వేసి యుంచిన కొలదికాలములో నానక గట్టిగ నుండు గింజల సంఖ్య తక్కిన కాయధాన్యముల కంటె కొంచెము హెచ్చుగ నుండును. కావున ముందుగ మొలక కట్టిచూచి మొలకనుబట్టి విత్తుల పరిమితిని హెచ్చింప వలసి యుండును.

సోయ అనుప వేళ్లపై పెరుగగల జాతుల సూక్ష్మజీవులు లేని నేల లందు వేళ్లయందలి నివసించు మొటిమలు విస్తారముగ గానవగు ప్రదేశము లందలి మంటిని కొంత దెప్పించి దానితో విత్తులను కలిపి చల్లిన నా నేల యందు గూడ నీ సస్యము బాగుగ నెదుగును. ఒక యెకరమునకు సరిపడు విత్తులు (20 పౌనుల) తో ½ పౌను మంటిని గలిపిన చాలును23.

మొక్కలు మొలచి కొంత వర కెదిగిన పిమ్మట నొకసారి గొప్పు త్రవ్వి కలుపు లాగివేయవలెను. అవసరమగుచో మరి యొకసారి గూడ యీ పనులను రెంటిని గాని, కలుపుతీత మాత్రము గాని చేయవచ్చును. వర్షకాలాంతమున తోట భూములలో సాగు చేయు చేలకు తడి యావసర మగుచో 15-20 రోజుల కొకసారి చొప్పున పలుచగ నీరు కట్టవచ్చును. తేమ హెచ్చగుచో మొక్కలు చెడును.

ఇతర కాయధాన్య జాతులవలెనే సోయ అనుమునకును నధిక వర్ష మొకయరిష్టము. పూతకాలమున మబ్బులు, వర్షములుకూడ హాని జేయును. దీని కీ ప్రాంతములం దిది వరకు సాగు చేసిన చోట్ల చీడలుగాని, తెగుళ్లు గాని యంతగా బట్టినట్లు గానరాదు. ఇంకను విరివిగ సాగునకు వచ్చిన నెట్లుండునో తెలియదు.

## 5. కోత, కైలు వగైరా

సోయ అనుమును మొదటికి గోసి యెండబెట్టి పెసర, మినుము వలెనే పశువులచే త్రొక్కించి గాని, కొంచెమున్నచో బడితెలతో గొట్టి

గాని కైలు చేయవచ్చును. సామాన్యముగ గింజ లెకరమునకు సుమారు 500 పౌనుల వరకు గావచ్చును. మెరక నేలలలో అనకాపల్లి క్షేత్రమున పైని పేర్కొనబడిన రకములు 880 పౌనుల వరకును, చామర్లకోట క్షేత్రమున 1200 పౌనుల వరకును, మారుటేరు క్షేత్రమున 2160 పౌనుల వరకును పైనను[24] తరుచు మిగుల తక్కువ గింజల నిచ్చుటకూడ సంభవించెను. మంచూరియాలో నెకరమునకు సగటున 1200 పౌ. చొప్పునను, జపాన్‌లో 960 పౌ. చొప్పునను అగునని యంచనా వేయబడెను. అమెరికా సంయుక్తరాష్ట్రములం దొక సారి 3 వేల పౌనుల వరకు నయ్యెనట. సామాన్య రకములలో కాయలు పండునప్పటికి మొక్కలాకులను జాలవరకు రాల్చివేయుటచే సామాన్యముగ గింజ లెన్ని పౌను లగునో చొత్తును అంతకు హెచ్చుకాదు.

సోయ అనుము నొకయెకరమున తొలకరిలో నితర సస్యమేదియు పెట్టక జూలైలో విత్తి సాగు చేయుట కగు వ్యయమును, అందువలని యాదాయమును ఈ క్రింద యంచనా వేయబడెను.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు | | | వ్యయము |
|---|---|---|---|---|---|
| | | ప.జ. | మ. | ఆ.‡ | రు.అ.పై |
| జూన్ | దుక్కి-2సార్లు | 3 | 3 | | 12- 0-0 |
| | గుంటక తోలుట | ½ | ½ | | 2- 0-0 |
| జూలై | దుక్కి-1సారి | 1½ | 1½ | | 6- 0-0 |
| | గుంటక తోలుట | ½ | ½ | | 2- 0-0 |
| | విత్తులు-40 పౌనులు | | | | 7- 8-0 |
| | చాలువిడిచి చాలున 9అం.ల | | | | |
| | కొకగింజ చొ॥ వేయుట | 1½ | 1½ | 3 | 7- 4-0 |
| | మొత్తము | 7 | 7 | 3 | 36-12-0 |

‡ ప.జ.=పశువుల జతలు; మ.=మగవాండ్రు; ఆ.=ఆడువాండ్రు.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు | | | వ్యయము |
|---|---|---|---|---|---|
| | | ప.జ. | మ. | ఆ | రు.అ.పై |
| | వెనుకటి పుటనుండి | 7 | 7 | 3 | 36-12-0 |
| ఆగష్టు | గొప్పు త్రవ్వట, కలుపుతీత | | 1 | 12 | 7- 0-0 |
| సెప్టెంబరు | కలుపుతీత | | 1 | 8 | 5- 0-0 |
| | కోత, మోత | | 1 | 10 | 6- 0-0 |
| | నూర్పిడి,యెగురబోత వగైరా | ½ | 1½ | ½ | 3- 4-0 |
| | గింజలు, పొట్టు తోలుట | ¼ | ¼ | | 1- 4-0 |
| | మొత్తము | 7¾ | 11¾ | 33½ | 59-4-0 |

| రాబడి | | రు.అ.పై |
|---|---|---|
| | గింజలు 500 పౌనులు, రు 1కి 25 సౌ. చొ॥ | 80- 0-0 |
| | బొత్తు-500 పౌనులు | 10-0-0 |
| | మొత్తము | 90- 0-0 |
| | నికరాదాయము | 30-12-0 |

సేద్యపు వ్యయము హెచ్చగుటచే తక్కిన కాయధాన్య జాతుల కంటె నీ గింజలకు హెచ్చు విలువ వచ్చినను గూడ పంట హెచ్చు పండినను గాని యీ సస్యపు సాగు వానికంటె హెచ్చు కిట్టుబాటు గాదు.

## 6. ఉపయోగము

సోయ అనుము ఆహారముగను, కొన్ని యితర వస్తువులను తయారు చేయుటకును కూడ నుపయోగింపబడు చున్నది.

సోయ అనుము నందు ఇతర కాయధాన్యములలో కంటె సుమారు రెట్టింపు మాంసకృత్తులును, 9 రెట్లు చమురును గలవని 1 వ యనుబంధము నందలి యంకెల వలన తెలియును. చమురు గింజలలో వేరుసెనగతోను, నూవుతోను బోల్చినయెడల వేరుసెనగలో కంటె సుమారు

1½ రెట్లు వరకును నూవులలో కంటె రెట్టింపునకు పైనను మాంసకృత్తులును, సగము వరకు చమురును నుండునని యీక్రింది యంకెలు తెలుపును.

| | సోయ అనుము (సగటు) | వేరుసెనగ | నూవు |
|---|---|---|---|
| తేమ | నూటికి 9.09 | 7.92 | 5.08 |
| మాంసకృత్తులు | ,, 38.68 | 26.72 | 18.33 |
| చమురు | ,, 17.50 | 40.13 | 43.26 |
| ఖనిజములు | ,, 4.96 | 1.87 | 5.20 |
| నారపదార్థము | ,, 4.33 | 3.07 | 2.88 |
| కర్బనోదజనితములు | ,, 23.01 | 20.29 | 25.55 |
| మొత్తపు పోషకశక్తి-కాలరీలు | ,, 120 | 157 | 161 |
| ఖటికము | ,, .237 | .045 | .453 |
| స్ఫురము | ,, .689 | .392 | 5.74 |
| ఇనుము (మిల్లిగ్రాములు)లక్షకు | ,, 11.50 | 1.56 | 10.45 |

సోయఅనుములో తక్కిన కాయధాన్యము లన్నిటిలో కంటెను, వేరుసెనగలో కంటెను గూడ స్ఫురమును, ఇనుమును హెచ్చుగ నుండును. కాని ఖటికము విషయమున నూవున కిది సాటిరాదు. విటమిను *A* గూడ హెచ్చుగనే గలదు. విటమిను $B_1$ కాయధాన్యములలో కంటె హెచ్చు. వేరుసెనగలోనున్నంత యుండును. విటమిను $B_2$ చాల జాతుల కాయధాన్యములందంత యుండును. వేరుసెనగలో కంటె హెచ్చు.

సోయ అనుము నందలి మాంసకృత్తులును, చమురును గూడ కాయధాన్యములలో కంటె హెచ్చుగ నుండుటచే వానికంటె జీర్ణమగుట కష్టము. కావున తగ్గించి తినవలసి యుండును. సోయ అనుము విస్తారముగ నుపయోగింపబడు ప్రాచ్యదేశములలో నొక విధమగు మండనము (*Fermentation*) గావించిన అనగా పులియబెట్టిన దినుసుతో తిన్న

బండారపు వస్తువులను దయారు చేయుటచే నవి హెచ్చు రుచికరములుగ నుండుటయే గాక సులభముగ జీర్ణమగునని గూడ యెంచబడుచున్నది[23].

మరియు సెనగ, కంది, మినుపపప్పులలోని మాంసకృత్తులందు వరుసగ నూటికి 76,74,64 వంతులు వంటబట్టు భాగముగను, చమురు గింజలగు నూవు నందలి మాంసకృత్తులందు నూటికి 67వంతులును, వేరుసెనగ లోని మాంసకృత్తులందు నూటికి 58 వంతులును వంటబట్టునవియుండ, సోయఅనుమునందలి మాంసకృత్తులలో మానవశరీరమునకు వంటబట్టు పరిమితి సుమారు నూటికి 54 మాత్రమే యని కనుగొనబడెను. కావున నితర కాయధాన్యములకు బదులుగ గాని, నూవునకును, వేరుసెనగకును బదులుగ గాని సోయ అనుము నుపయోగించుట వలన ప్రత్యేక లాభమంతగా గానబడదు. కాని సోయ అనుముయొక్క మొత్తపుపోషకశక్తి కాయధాన్యముల మొత్తపుపోషకశక్తి కంటె హెచ్చగుటచే పెసర, మినుము కంటె నెచటనయిన నిది హెచ్చు పంట నిచ్చుచో గాని, యవికానిచోట్ల అనగా సముద్రము కంటె 5 వేల యడుగుల కంటె నున్నతముగ నున్నచోట్ల గాని దీనిని సాగు చేసి యీ గింజల నుపయోగింప వచ్చును. వేరుసెనగ పండింప వీలగు చోట్ల దీనితో సోయ అనుము పోటీకి నిలువ జాలదు.

వేరుసెనగలో వలెనే యిందును కర్బనోదజనితములు తక్కువగ నుండుటచే అతిమూత్రవ్యాధి గల వారి కిది కూడ యనుకూలించును.

నానబెట్టిన గింజలను కొంచెము ప్పుతో నుడుకబెట్టి అనుము వలె గుగ్గిళ్లుగ గాని, పోపుపెట్టి గాని తినవచ్చును. కాని నానని గట్టిగింజలు హెచ్చుగ నుండుటచే వానిని జాగ్రత్తగ నెంచివేసి తినిన గాని పండ్లకు బాధ కలుగును. లేక పచ్చిగింజలను లేక నానవేసిన గింజలను గాని వంగ మొదలగు కూరలలో వేసి వండవచ్చును.

నానవేసిన గింజలను గాని, పప్పును గాని మినుప పప్పువలె రుబ్బి గారెలు, వడలు, మజ్జిగవడలు, యిడ్డెనలు మొదలగు పిండి వంటలను దయారు చేయవచ్చును. పిండితో ప్రత్యేకముగ గాని, యితర రకముల

పిండితో కలిపి గాని దోసెలు, పూరీలు, జంతికలు, కారపుపూస, జిలేబి, మైసూరుపాకు మొదలగు వస్తువులను దయారు చేయవచ్చును. ఈ పప్పును పప్పుపులుసు, సాంబార్, కూటు (వెనుకటి రెండును అరవలు తయారుచేయు నొక విధమగు పప్పుపులుసు భేదములు) వగైరా ఆహారము లందు గూడ సామాన్యముగ నుపయోగింప వచ్చును. సోయ అనుముతో ప్రత్యేకముగ చేసిన పిండివంట జీర్ణమగుట చాల కష్టమగుటచే దీనిని 3-4 రెట్లు యితర జాతుల పిండితో కలిపి యుపయోగించుట మంచిది[25].

అమెరికాలోను, జర్మనీలోను నీ పిండి యితర జాతుల పిండితో కలుపబడి రొట్టె, బిస్కట్లు, జంతికపూస (*Vermicelli*) మొదలగునవి తయారు చేయబడు చున్నవి. రెండవ ప్రపంచ యుద్ధము నందు జర్మనులు దీనితో కొద్ది పరిమాణమున హెచ్చు పోషక పదార్థము కలిగి కొన్ని దినములకు సరిపడు నాహారము జేబులలో నిముడున ట్లొక విధమగు ఇనుప బత్తెము (*Iron ration*) ను తమ సైనికుల కిచ్చుచుండిరట. ఒక పత్రిక యీ యాహారమునకు 'నాజీ యినుప మాత్రలు' అని పేరు పెట్టెను[23].

సోయ అనుములను నానబెట్టి పొట్టు పోవునట్లుచేసి రుబ్బి పాలను దీసి వానిని ఆవుపాలకు బదులుగ నుపయోగించుట గలదు. ఈ పాలనుండి నీరిగిరిపోవునట్లు చేసి పాల పౌడిని గూడ తయారుచేయుచున్నారు. ఇది ఆవుపాల పౌడి వలెనే మరల నీటిలో వేసి కలిపిన కరగి పాలవలె నగును.

సోయ అనుమునుండి చమురును తీసి దానిని నూవులనూనె వాడి నట్లు వాడవచ్చును. గింజలనుండి లభించు శ్రేష్ఠమగు చమురులలో నిది యొకటిగ నెంచబడు చున్నది. కాని యిందు నూవులో కంటెను వేరుసెన గలలో కంటెను చాల తక్కువ చమురుండుటచే నీ చమురుతీయుట యీ ప్రాంతములందు కిట్టుబాటుగ నుండదేమో! ఒక తణిఖీలో సామాన్యపు గానుగలో వేసి యాడిన చమురు దిగనే లేదట[24]. అమెరికాలో నీ గింజలనుండి చమురు విరివిగ దీయబడుచున్నది.

చమురు తీయగా మిగులు పిండి మానవులకును, పశువులకునుగూడ బలమయిన యాహారముగ నెంచబడు చున్నది. అమెరికాలో దీనినుండి

సుమారు నూటికి 41.6 వంతులు మాంసకృత్తులును, 1.4 వంతులు చమురును, 27.5 వంతులు కర్బనోదజనితములును, 7.2 వంతులు నారపదార్థమును గలిగి సులువుగ జీర్ణమగు నొక విధమగు పిండిని ప్రత్యేకముగ తయారుచేసి విక్రయించుచున్నారు.

సోయ అనుమునుండి యాహారపు దినుసులే కాక మోటారు బండ్లలో ననేక భాగములను చేయుటకు బనికివచ్చు కొమ్మువలె గట్టిగను, నునుపుగను నుండు వెలుసులేని (Elastic) ద్రవ్యములు (Plastics) గూడ అమెరికాలో ఫోర్డుగారి ఫ్యాక్టరీలలో తయారు చేయబడుచున్నవి.

ఆకులతో గూడిన సోయ అనుపబొత్తును పశువులు బాగుగ దినును. సంఘట్టనము 1D యనుబంధమున గాననగును. కాడలు ముదురక ముందు సోయ అనుప రొట్టను పచ్చిదిగా గాని, యెండించి గాని పశువులకు మేపు కొనవచ్చును.

## 7. సోయ అనుముల యుత్పత్తి, వ్యాపారము

ప్రపంచమున సోయ అనుము విస్తారముగ బండింపబడుచున్న దేశములలో మంచుకుయో(మంచూరియా) దేశమును, అమెరికా సంయుక్త రాష్ట్రములును ప్రధానములయి యున్నవి. మొదటి దేశములలో సుమారు 42 లక్షల టన్నులును, రెండవదానిలో 18 లక్షల టన్నులును యుత్పత్తి యగుచున్నవని యంచనావేయబడుచున్నది²³. మొదటి దేశపు పంటలో సుమారు సగము దినుసు విదేశాలకు - ముఖ్యముగ జర్మనీకి యెగుమతి యగుచున్నది.

# బొబ్బర లేక అలచంద

*Cowpea or cowgram - Vigna catyang*

అరవము-కారామణి; మళయాళము-మాంపయర్; కన్నడము-అవరె;
హిందీ-లోబియా; సంస్కృతము-బర్బటః, రాజమాషః

## 1. చరిత్ర, వ్యాపకము

బొబ్బర ఆఫ్రికాఖండమందలి సహారాయెడారికి దక్షిణమున వన్యస్థితి యందు గానవగుటచే నదియే దీని కాదిమస్థానమై యుండవచ్చునని యెంచబడు చున్నది[8]. ఇండియా కిది యెపుడు వచ్చెనో తెలియదు. యజుర్వేదమున బేర్కొనబడిన సప్తగ్రామ్యములందు గాని, బృహదారణ్యకోపనిషత్తునందు పేర్కొనబడిన దశధాన్యములందు గాని. పాణినియష్టాధ్యాయి యందు గానవగు సస్యముల పేళ్లలోగాని యిది కానరాదు. కాని వాగ్భటుని యష్టాంగహృదయమున పదునాల్గు శింబి(కాయ)ధాన్యములలో నిది యొకటిగ నున్నది. అంకురారోపణ కుపయోగింప బడుచున్న నవ ధాన్యములలో కూడ నిది చేరియున్నది. కావున యిది పెసర, మినుము లంత ప్రాచీనకాలము నుండి యార్యావర్తనమున సాగునం దుండినట్లు కానరాదు. పౌరాణిక యుగమున నీ దేశమునకు వచ్చియుండునని దోచును.

బొబ్బర యిపుడు పూర్వార్థగోళము నందలి చాల దేశము లందు కొద్ది గొప్ప సాగు చేయబడు చున్నది. 20 వ శతాబ్ద మధ్యమున నిది ఉత్తర అమెరికాకు వ్యాపించెను. అందలి సంయుక్తరాష్ట్రములం దిపుడిది విరివిగ సాగు చేయబడు చున్నది. 1920 వ సంవత్సరము నాటికే యచట సుమారేడు లక్షల యెకరములపై సాగునం దుండెను[26]. ఆఫ్రికాలోని పడమటి భాగమునను, ఈజిప్టు, సుడాన్, కెన్యా, ఉగాండా, రొడీషియా దేశము లందును గూడ నిది సాగునందు గలదు.

ఇండియాలో నీ సస్యము చాల రాష్ట్రములలో కొద్ది గొప్ప సాగునం దున్నది. కాని విస్తీర్ణము తెలియదు.

చెన్నపురి రాజధానిలో నీ సస్యము స్వల్ప విస్తీర్ణము పైననే సాగు చేయబడు చున్నది. ఇటీవలి యంకెలు లభింపలేదు. కాని సుమారు 30_40 వేల యెకరములపై నీ సాగు చేయబడు చున్నదని నలుబది సంవత్సరముల క్రిందట నొక యంచనా వేయబడెను. తెలుగు జిల్లాలలో కంటె అరవ జిల్లాలలో నిది విస్తారముగ సాగు చేయబడు చున్నది. తెలుగుజిల్లాలలో దత్తమండలములును, విశాఖపట్నపు జిల్లాయును ముఖ్యములు.

## 2. మొక్కయొక్క స్వభావము, రక భేదములు

బొబ్బర సామాన్యముగ నేలపై ప్రాకు తీగ. ఏదైన ప్రాపు దొరకిన యెడల దానిపై కెగబ్రాకును. అనుము వలె కొంత గుబురుగ పెరుగు రకములును గలవు. వేరు అనుములో వలెనే కొంత లోతుగ బోవును.

కాండము సామాన్యముగ ననుపకాండమంత లావుగ నుండును. చాల రకములలో దీనిపైని ఊదా లేక లేతగులాబీ రంగుండుట గలదు. కొన్ని రకములలో నీ రంగు కణుపువద్ద మాత్రమే యుండవచ్చును.

ఆకునందలి మూడు ఉపదళములును సామాన్యముగ ననుములో కంటె పెద్దవిగను, వెడల్పుతగ్గి నిడివిగను నుండును. వీనిరంగు సామాన్యముగ నాకుపచ్చగ నుండును. కాని కొన్ని రకములలో తొడిమెపైని గాని, యీనెల పైనిగాని కొద్దిగొప్ప ఊదా రంగుండుట గలదు.

పూవులు సామాన్యముగ జంటలుగనుండును. కాని యొక కాడపై మొదట నేర్పడిన రెండు పూవులును ఏ కారణముచే నయిన చెడుచో దాని పైని మరి రెండు బయలుదేరును. ఇవియు చెడినచో పైని మరి రెండు పుట్టుటయు గలదు.

## 28 వ పటము



బొబ్బరయాకు ($\frac{1}{4}$ ఆకృతి)

పూవులు అనప పూవులకంటె యించుక పెద్దవిగ నుండును. ఆకర్షకపత్రములు సామాన్యముగ తెలుపుతో గూడిన నీలవర్ణము గలిగి యుండును. పూర్తిగ తెలుపుగ నుండుటయు గలదు.

పూవులు సామాన్యముగ ఆత్మసంపర్కము వలన గర్భవతులగును. కాని కీటకములచే పరసంపర్కము గలుగుట గూడ గలదుః.

## 29 వ పటము



బొబ్బరకాయ ($\frac{1}{2}$ ఆకృతి)

కాయలు తక్కిన కాయధాన్యములలో కంటె నిడివిగ నుండును. 3-12 అంగుళముల వర కుండు రకములు గలవు. అడుగునకు పైగా నుండుటయు గలదు. కాయలు కురుచగ నుండు రకములలో నివి పెసర కాయల వలె నిలచి యుండును. నిడివిగ నెదుగు రకములలో ప్రక్కలకు వ్రాలియుండుట గాని, క్రిందికి వ్రేలాడుట గాని గలదు. కాయ పచ్చిగ నున్నపుడు పసరుగ నుండును. పండినపుడు గడ్డి వర్ణము వచ్చును. ఊదా రంగు కాయలు గాని, ఊదా మచ్చలు గల కాయలు గాని ఉండు రకములును గలవు.

30 వ పటము గింజ మినుప గింజవలె నించుక కోలగ నుండును. కొంచెము పెద్దది. ఔన్సుకు రకమును బట్టి 150-250 గింజల వరకు తూగును. లేబసిమి లేక పసిమిరంగు గలిగి నునుపుగ యుండును. ఊదా, నలుపు రంగుల గింజ లుండు రకములు గలవు. వీనిపైన మచ్చ లుండుటయు గలదు.



బొబ్బర గింజ (2 రెట్లు)

బొబ్బరలో ననేక రకములు గలవు. ఇవి సామాన్యముగ పెద్ద బొబ్బర, చిరుబొబ్బర అని రెండు తరగతులుగ విభజింపబడు చున్నవి *. పెద్ద బొబ్బర గింజల కంటె చిరుబొబ్బర గింజలు కొంచెము చిన్నవిగ నుండును. కాయలును చిరుబొబ్బరలో చిన్నవిగను (3-5 అంగుళములు), పెద్ద బొబ్బరలో కొంత పొడవుగను (8-12 అంగుళముల వరకును) ఉండును. పెద్దబొబ్బరకు తీగగ ప్రాకు స్వభావము హెచ్చు. చిరుబొబ్బర యనుము వలె గుబురుగ నెదుగును. ఈ రెండునుగాక తీగగ ప్రాకి 1-3 అడుగుల పొడవు వర కుండి కూర కుపయోగించు కాయలను గాయుం మరియొక తరగతి బొబ్బర కూడ గలదు. దీనిని సామాన్యముగ గోల కొండ చిక్కుడందురు.

---

* కొన్ని చోట్ల చిరుబొబ్బరను అలచంద యందురు కాని యీ పదము చాల చోట్ల బొబ్బరతో సమానార్థకముగనే యుపయోగింపబడు చున్నది.

చిరుబొబ్బరలోను, పెద్ద బొబ్బరలోను-ముఖ్యముగ రెండవదానిలో పైని వ్రాసినట్లు గింజల రంగునందేగాక, ఫలించు కాలమునందును వ్యత్యాసము గల రకము లనేకములు గలవు.

ఆంధ్రదేశమున సామాన్యముగ సాగునందున్న చిరుబొబ్బర రకము లును పెద్ద బొబ్బర రకములును గూడ భేదిసిమి లేక పసిమివర్ణపు గింజల రకములే. కాని రెంటియందును కొంత వర కితర లక్షణములందు భేదము గల మొక్కలు గూడ జేరి యుండుట గలదు.

కొన్ని చోట్ల పెద్ద బొబ్బర రకములు పచ్చికాయల యమ్మకము కొరకు గోలకొండచిక్కుడు వలె ప్రత్యేకముగ సాగు చేయబడుచున్నవి. ఇందుకు బనికివచ్చు మేలయిన తెలుపు, యెరుపు వగైరా రంగులుగల గింజల రకముల విత్తుల నిపుడు వ్యాపారస్తులు కొందర మ్ముచున్నారు. కొన్ని గవర్నమెంటు ఫారములలో గూడ దొరకును.

కోయంబత్తూరునందు ఎంచి తీయబడిన C.57 అను వంగడము ఇంతవరకు పరీక్షింపబడిన వాటిలో మిన్నగ కనబడుచున్నది.

## 3. సాగునకు దగిన పరిస్థితులు

బొబ్బర యుష్ణ ప్రదేశము లందును, సమశీతోష్ణ ప్రదేశములందును గూడ పైరగుచున్నది. కాని తక్కిన కాయధాన్య జాతులకు వలెనే పూతకును, కాపునకును కొంత శీతల మనుకూలము. పెద్ద బొబ్బరను తొలకరిలో (జూన్-జూలైలలో) చల్లవచ్చును. ఇట్లు చల్లిన పైరు వర్ష కాలాంతమున కాపు పట్టును. కొన్నిచోట్ల దీని నాగష్టులో గూడ చల్లుట గలదు. దీనిని, చిరుబొబ్బరను గూడ సెప్టెంబరు-అక్టోబరు నెల లలో గూడ జల్లవచ్చును. ఇదియే యీ సస్యమును విస్తారముగ జల్లు కాలము. చిరుబొబ్బరను వరిచేలను కోసికొని నవంబరు-డిసెంబరులలో గూడ జల్లవచ్చును. తొలకరిలో చల్లు పెద్ద బొబ్బర ఫలించుటకు సుమారు 6 నెలలు పట్టును. సెప్టెంబరు-అక్టోబరులలో చల్లు చిరుబొబ్బర

సుమారు నాల్గు నెలలలో పంటకు వచ్చును. వరి మళ్లలో నవంబరులో జల్లు చిరుబొబ్బెర పంటకును సుమారు ఇంతేకాలము పట్టును.

బొబ్బెరకు తేలిక నేల లనుకూలము. ఇసుక గరుసు లందు బాగుగ పెరుగును. గరుప నేల లందును ఇసుక నేల లందును గూడ పైరు చేయ వచ్చును. బంక నేల లంతగా ననుకూలము గాకపోయినను కొన్నిచోట్ల నితర సస్యములతో కలిపి యిట్టి నేల లందు సైత మిది సాగు చేయబడు చున్నది.

## 4. సేద్య విధానము

బొబ్బెర అనుము వలెనే తరుచు తృణధాన్యములలో కలిపి సాగు చేయబడు చుండును. తొలకరిలో జల్లు పెద్ద బొబ్బెర తరుచు గంటె చేలలో మిశ్రణముగ సాగు చేయుబడు చుండును. సెప్టెంబరు-అక్టోబరు నెలలలో బొబ్బెర సామాన్యముగ చోడితో గాని జొన్నతో గాని కలిపి చల్లబడు చుండును. ఈ కాలమున దీనిని ప్రధాన సస్యముగనే పెంచుట కూడ గలదు. ఇట్లు చేయునపుడు దీనితో నితర కాయధాన్యములను గూడ గలుపుట గలదు. ఇట్లు కలిపి సాగు చేయు వానిలో అనుమును, ఉలవయు ముఖ్యములు. వరి చేలలో బొబ్బెర తరుచు ప్రత్యేకముగనే సాగు చేయబడు చుండును. మెట్ట భూములలో దీనిని ప్రధాన సస్యముగ సెప్టెంబరు-అక్టోబరు నెలలలో జల్లునపుడు మొదట పంట సామాన్య ముగ మెట్టవరి గాని, చోడి గాని యయి యుండును.

బొబ్బెర చల్లు నేలను 2-3 సార్లు దున్నివిత్త వచ్చును. వెదజల్లుట సామాన్య పద్ధతి. వరి చేలలో దీనిని చల్లి రెండుసార్లు కలియదున్నుదురు. పెసర, మినుము వలె దీనిని తొణుకు చల్లిన యెడల వేరు పోవ లసినంత లోతుగ బోక పైరెదుగదు. బొబ్బెర గింజలు మొలచుటకు పెసర, మినుము కంటె కొంచెము హెచ్చు తేమ కావలెను.

ప్రత్యేకముగ జల్లు నెడల నేల యొక్క సత్తువను బట్టి సుమారు 5–6 సేర్ల గింజలను జల్లవచ్చును. మిశ్రణముగ సుమారు 2–4 శేర్లు చల్ల వచ్చును.

పూత కాలమున తూర్పు గాలియు, మబ్బులును ఇతర కాయధాన్యములకు వలెనే బొబ్బరకును హానికరము. కాని యిందువలన బొబ్బర చేలకు సామాన్యముగ నితర పయిరచేలకు పట్టు చీడ లంతగా పట్టవు. అప్పుడప్పుడు పేను ( *Aphis. sp.* ) విస్తారముగ పట్టుట గలదు. ఒక్కొకప్పు డొక విధమగు పచ్చపురుగు ( *Euchrysops Cneyus* ) కాయలకు పట్టి దొలచుట గలదు. ముందుగ పుష్పి పట్టిన కాయల నేరి పారిపెట్టుచో నిది వృద్ధి నొందదు. ఆకులను దిను కీటకజాతులును, కాడలను దొలచునవియు గూడ గలవు. కాని యరుదు. ఆచరణీయమగు ప్రతీకారములును గానరావు.

## 5. కోత, కైలు వగైరా

అనుప కాయల వలెనే పెద్ద బొబ్బర కాయలను పండిన కొలదిని యేరుట సామాన్యాచారము. కాని యొక్కొకప్పుడు–ముఖ్యముగ చిరు బొబ్బర–చేని నంతటిని ఉలవ చేని వలె గోసి యెండనిచ్చి నూర్చుటయు గలదు.

ప్రధానసస్యముగ జల్లిన బొబ్బర చేను యెకరమునకు సామాన్యముగ సుమారు 50–70 కుంచములు* (400–600 పౌనుల) గింజల నిచ్చును. ఎకరము 1 కి 1200 పౌనుల వరకగుట గలదు. అమెరికా సంయుక్త రాష్ట్రములలో 1920 వ సంవత్సరమున సగటు పంట యెకరము 1 కి 1500 పౌను లుండెనట[26].

మిశ్రణమున సామాన్యముగ సుమారు 25–35 కుంచములు(సగటున 30 కుంచములు లేక 250 పౌనులు) కావచ్చును. బొత్తు సామాన్యముగ గింజల తూనికకు 1½ రెట్లుండును.

---

* బొబ్బర్లు కుంచము 1 కి సుమారు 8¼ పౌనులు తూగును.

బొబ్బరను ప్రత్యేకముగ సాగు చేయుచోనగు వ్యయమును, రాదగిన రాదాయమును ఈ క్రింద యంచనా వేయబడెను.

| నెల | చేయవలసిన పని | వలయుపాటు | | | వ్యయము |
|---|---|---|---|---|---|
| | | ప.జ | మ. | ఆ.† | రు.అ.పై |
| సెప్టెంబరు | దుక్కి-2సార్లు | 3 | 3 | | 12-0-0 |
| అక్టోబరు | విత్తులు-16 పౌనులు | | | | 3-0-0 |
| | కలియదున్నుట, తోడుగుతోలుట | 3 | 3 | | 12-0-0 |
| జనవరి- | కోత, కైలు వగైరా | $\frac{3}{4}$ | 2 | $12\frac{1}{2}$ | 10-8-0 |
| | మొత్తము | $6\frac{3}{4}$ | 8 | $12\frac{1}{2}$ | 37-8-0 |

రాబడి

| | |
|---|---|
| బొబ్బర్లు- 500 పౌనులు, రు 1కి 36 పౌ. చొ॥ | 55-8-0 |
| బొత్తు-750 పౌనులు, రు 1కి 250 పౌ. చొ॥ | 12-0-0 |
| మొత్తము | 67-8-0 |
| నికరాదాయము | 30-0-0 |

చోడితో జెరిసగపు మిశ్రణముగ సాగుచేసిన యెడల నగు ఆదాయ వ్యయములు ఈ క్రింద జూపబడెను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సెప్టెంబరు | విత్తులు-8 పౌనులు | | | | 1-8-0 |
| | కోత, కైలు వగైరా | $\frac{1}{2}$ | 2 | $8\frac{1}{2}$ | 7-12-0 |
| | మొత్తము | $\frac{1}{2}$ | 2 | $8\frac{1}{2}$ | 9-4-0 |

రాబడి

| | |
|---|---|
| బొబ్బర్లు-250 పౌనులు రు 1కి 36 పౌ. చొ॥ | 28-0-0 |
| బొత్తు-500 పౌనులు రు 1కి 250 పౌ. చొ॥ | 8-0-0 |
| మొత్తము | 36-0-0 |
| నికరాదాయము | 26-12-0 |

† ప.జ=పశువుల జతలు; మ=మగవాండ్రు; ఆ=ఆడువాండ్రు

## 6. ఉపయోగము

నిత్యాహారమున బొబ్బర్లను వాడుట యరుదు. గింజల నుడకబెట్టి యట్లేగాని, సాతాళించిగాని తినుట గలదు. ముదిరిన పచ్చికాయలనుండి ముఖ్యముగ పెద్ద బొబ్బర కాయలనుండి గింజలను దీసి వానిని సాతాళించి తినుటయు గలదు. ఇట్టి గింజలను వంగ మొదలగు నితర కూరలతో కలిపి వండుటయు, వేచుటయు గలదు. వీనిని పప్పుపులుసు (సాంబార్, కూటు) మొదలగు వానిలో వేయుటయు గలదు. పప్పుతోను, పిండితోను ప్రత్యేకముగ గాని, యితర కాయధాన్యములు పప్పుతోను, పిండితోను జేర్చి పిండివంటలు చేయుటయు గలదు.

సంఘట్టనమున నవుములకును, బొబ్బర్లకును అంతగా భేదము గానరాదు. (I-A, B అనుబంధములు జూడుడు). కాని అంతకంటె కొంచెము సులువుగ జీర్ణమగును. ఇందలి మాంసకృత్తులలో సుమారు నూటికి 61 వంతులు వంటబట్టునని కనుగొనబడెను[13].

బొబ్బర్ల నుడుకబెట్టి పశువులకు దాణాగా పెట్టుదురు. బొబ్బర పొత్తును పశువులు బాగుగ దినును. కాని దీని సంఘట్టనమును తెలుపు అంకెలు లభింపలేదు.

పచ్చి రొట్ట కూడ పశువులకు మంచిది. దీనికి ప్రత్యేకముగ మేతకొరకు పెంచుట గూడ గలదు.

ఈ సస్యము పచ్చి యెరువునకు – ముఖ్యముగ సముద్రప్రాంతములందు పెంచు కొబ్బెర తోటలలో చల్లి కలియదున్నుటకు–మిగుల ననుకూలమయినది.

